## శ్రీ ఆంజనేయస్వామి.



### కృతిపతి.

తే॥ అనిలసూనుఁడు యంజనీయాత్మజుండు ।
భానుశిష్యుండు శ్రీరామభక్తవరుఁడు ।
దాసదాసుల నేలెడు ధన్యతముఁడు ।
నాదుకృతిపతియా గాత నాణ్యమతిని ॥

నతుఁడ

వేమూరి శ్రీరంగనాయకుఁడను.

# విజ్ఞప్తి.



మనఆంధ్రదేశంబున భక్తిరస ప్రధానంబగు నాటకంబులరుదగుటంజేసి, చింతామణీనాటకంబొండునూతనముగ వెల్వడియు నందుభక్తియరుదైశృంగారంబధికంబగుటంజేసిమత్సోదరుండు వేమూరిచిన్నయ్యారావుపంతులు శృంగారభక్తిరస ప్రధానంబును జగత్పవిత్రంబగు ప్రసిద్ధచారిత్రంబును నగు తులసీదాసు చారిత్రంబును నాటకరూపంబుగ రచింపుమని నన్నుబురిగొల్ప వల్లెయని 1922 సం॥ అక్టోబరు మాసంబున మొదలుబెట్టి 1922 సం॥ నవంబరు 11 వ. తారీఖున పూర్తిజేసియు కారణాంతరములచే యింతవరకు అచ్చొత్తించలేనైతి.

ఈ మహాత్ముని చారిత్రము నాటకరూపంబున యీరీతిగ వెలువడుటకు నాసోదరుఁడు వేమూరి దుర్గానాగేశ్వరరావు పంతులే కారకుఁడు.

ఉభయభాషా ప్రవీణులును పండిత శ్రేష్ఠులును నాటకాలంకార కళా విభూషితులును నగు బ్రహ్మశ్రీ కురుగంటి సూర్యనారాయణ శాస్త్రిగారిచే యీప్రతము సంపూర్ణముగబరిష్కరింపబడియె. అందుకై వారికి నామనఃపూర్వక వందనము లాచరించెద.

నేనీపొత్తంబును 11-11-1922 నాఁటిరాత్రి 10 గంటల 30 నిముసములకు ముగించితి. ఆనాఁడే 11 గంటలకు పుత్రికా జననమైనందున నీపొత్తంబును నాంజనేయునకే కృతిగా నొసంగితి.

నేనింతకుముందు దత్తాత్రేయగుణ ముకురంబును, మీనాక్షీస్మృతి యనురెండు పొత్తంబుల రచించితినే గాని నాటకంబును రచించి ప్రకటించుట కిదియే ప్రథమమగుటఁ జేసి దీనియందుగల దప్పుల నొప్పులుగ దిద్ది తెల్పిన మరియొక ముద్రణయందు అట్టివారికి వందనము లాచరించుచు సవరించుకొందును.

ఇట్లు విధేయుఁడు,
గ్రంథకర్త.



# పండితాభిప్రాయము



## పంచరత్నములు

---

చ॥ కవితకు మున్వితార్థరుచి కల్పనలంబడ గుంభనంబులన్
నవరసవర్ణనోన్మిషద నల్పరసంబుల దేలి పూర్వమం।
దవిరళ ధారగా బొలచు నయ్యది యిప్పటివారి నోటిలో
దవిలియు నీరసంబగు మతిప్పుల చత్తయనంగఁ జెల్లుఁబో ॥

చ॥ భువిని పుడైన నొక్కెకడ బొల్పెసగున్ రసవంత మౌచు సం
స్తవమున వ్యంగ్యభంగ్య విశదంబుగ శ్రీయుత రంగనాయకుల్
దవిలి రచించె శ్రీతులసిదాసు చరిత్రము నాటకంబు వా
స్తవముగ నేను జూచితిని దర్శనమయ్యె దీని చూడుడీ॥

మ॥ తులసీదాసు చరిత్ర నాటకము నిర్దోషంబు భక్తిప్రప
త్తులకున్ దావలముం దివ్యకురసిక స్తోమాంతరంగ ప్రమో
దలతారోపణ సేచనోల్లసన సంధానంబునై యొప్పుని
త్తులరంగస్థలి సుప్రయోగలసదౌచిత్యంబు వర్ధిల్లగన్॥

సీ॥ మమతపైనమితపై మమతపై నెలకొన్న
వ్యవహారముల నెల్లవ్యవధి పడగ।
గృహముపై పరిపాటి నిహముపై గలనాటి
మహి మేది మరునోది నహము పెరుగ।
వలపుగొల్పుల జిక్కి వెలవెలందుక మాయ
వలజిక్కి మతిదక్కి వలను చెడగ
జనని యాజ్ఞను ద్రోచి జనకునాజ్ఞను గాచి
వనమోహనాంగి పైవలపు దెసఁగ

గీ॥ రసములన్ని నొక శాంత రసములోనె
డిందకేయుచు రాముపై డెందమునిచి
యనుమ చెలిమిని రాముదర్శనము గొన్న
తులసిదాసుని చరితకు తులయుగలదె॥



1. నాటకము పేరు— తులసి నాటకం
2. నాటకమును చేసిన వారిపేరు-- శ్రీరంగ నాయిక.
3. నాటకమును బరిష్కరించిన వారిపేరు - సూర్య నారాయణ.

శా॥. తుంగానూర్జిత త్రుదరంగ కవిదత్తా నారదారావశా
లంగార్య స్వచిరంపథంజ్ఞకసు బంకాయత్రితా యద్రిట
త్సాంగానాదర గర్వపర్వకబుధ శ్రీకర్త బాణాత్మకం
కంగా నాతురలోల వాగ్వనితమున్గాన్ శ్రీనటత్కాళికం॥

బెజవాడ
1.11.24

ఇట్లు
కురుగంటి సూర్యనారాయణ శాస్త్రి.



# నాటకమునందు వచ్చు పాత్రలు

## —పురుషులు—

తులసీదాసు — నాయకుఁడు.

ఆత్మారాముఁడు — నాయకునితండ్రి.

బ్రాహ్మణుఁడు — రామమతాధిపతి.

ప్రశాంతుఁడు }
విశారదుఁడు } — నాయకుని మిత్రులు.

వృద్ధబ్రాహ్మణుఁడు—ఆంజనేయునిమారురూపము

ఆంజనేయులు.

శ్రీరాములు.

లక్ష్మణుఁడు

సూత్రధారి.

## —స్త్రీలు—

మమతాదేవి — నాయిక.

రామాబాయి — నాయకుని తల్లి.

బ్రాహ్మణి — రాక్షస రూపిణి.

కనకాంగి — వేశ్య.

దేవకన్య—నాయకుని మోహమడంచవచ్చినస్త్రీ.

ఇందుముఖి — కనకాంగి చెలికత్తియ.

సీతాదేవి.

N. B. 1. ఈనాటకము మూడుగంటలలో ప్రదర్శించుటకు వీలగునట్లు నాటకము క్లుప్తపరచితి.

2. ఈనాటకమునందుగల పద్య గద్యముల దేనిని లోపాడ కూడదు.



# గోస్వామి తులసీదాసు నాటకము.

## నాంది.

ప్రస్తావన– నటీసూత్రధారులు– రంగప్రవేశము.

శా॥ శ్రీకాంతా కుచమండ లీతరళ కాశ్మీ రార్ద్రముక్తావళీ,
స్తోకాంతర్మిళదాత్మదేహరుచి విస్ఫూర్జన్ మహేంద్రోస్మణి
లాకారంబుల సస్మితంబయినసీతాస్యాబ్జమున్ జూచున
స్తోకోద్యత్తులసీ దళుండు, రఘుచంద్రుండెప్డు మమ్మేలుతన్–

### కీర్తన.

"శ్రీరామచంద్ర, కృపాళుభజామన, హారణభవభయ, దారుణం;
నవకంజలోచన, కంజముఖ, కరకంజ, పదకంజారుణం
॥శ్రీరా॥

కందర్ప అగణిత, అమితఛవినవ, నీలనీరద సుందరం।
పటపీతమానో, తడిత–రుచి–శుచి, నౌమిజనక, సుతావరం
॥శ్రీరా॥

భజుదీనబంధు, దినేశదానవ– దైత్యవంశనికందనం;
రఘునంద, ఆనంద, కంద, కోశలచంద, దశరధనందనం
॥శ్రీరా॥

శిరముకుటకుండల– తిలకచారు– ఉదారఅంగవిభూషణం;
అజానుభుజ, శర– చాప–ధర, సంగ్రామజిత–ఖర–దూషణం"
॥శ్రీరా॥

సూత్ర, నటి:— కీర్తన-

"వందే! చరణకమల రఘునందన్।

1 జనకీ, కృపాసకల సుఖసంతతి పావత్ జనభక్తన్ ఉరుచందన్
అవుదపురిమే నిత్యవిరాజే — జనకసుతాయుత — దుష్ట
నికందన్— వందే॥

2. తీః తాప అరుజన్మ మరణభయ దూరకరత-భివమే జనరంజన్
సంతతమన్. చరణన్ మేధగవన్ కృపాకరో — సేవక భయ
భంజన్— వందే॥—

(పుష్పాంజలి సభికులపై జల్లిపోవును)





# గోస్వామి తులసీదాస నాటకము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

స్థలము:— విశారదుని గృహము

(ప్రవేశము విశారదుఁడు, ప్రశాంతుఁడు.)

ప్రశాంతుఁడు:— ఆతఁడట్టి స్వభావముగలవాఁడు కాఁడు. విశారదా! ఈవిషయమున నీవు నిశ్చయముగా పొరపడితివి.

విశారదుఁడు:— పొరపాటైనచో నంతకంటె నదృష్ట మేమున్నది! మొన్నటినుండియు నాతని వైఖరి యంతయు మరియొక లా గున్నది. ఆతని ముఖలక్షణములే యాతని మనోవైకల్యమును సూచించుచున్నవి.

ప్రశాం:- ఏమి నీవెఱ్ఱి! అతఁ డమాత్యపదవి నధిష్ఠించి సుమా రేఁడాది గావచ్చినది. ఈలోన అక్బరు ఫాదుషా మందిరమున నెన్ని శుభకార్యములు జరిగియుండలేదు. ఎన్నిసారులు తులసీదాసే సాని మేళములను జూచుటకు వచ్చియుండలేదు. నీకు పట్టి యనుమానమే కాని—

విశా:- కారణములేకయే యనుమానింతు నని తలంచితివా? సహజముగా నాతఁ డన్యకాంతలను దలయెత్తియైనఁ జూడనొల్లఁడు. భక్తిపారవశ్యంబున శ్రీరామ చరణారవిందంబులనుండి తన దృష్టిని మరల్పఁగొనఁజాలని యోగివలె కనకాంగీతనూలతఁ జిక్కిన తనహృదయము నాతఁడు విడిపించుకొనఁజాలకపోయెను. ఎంతటి ప్రేమ లేకున్న తేరిజూడనయిన సాహసింపనివాఁడు రత్నస్థగితమగు తన ముద్దుటుంగరముచే నాసుందరిని బహూకరించును?

పరిశాం:- అనుమానింప దలఁచుకొన్న వానికన్నియు ననుమానములే. హిందూ రాజ్యరమాధురంధరుండగు అక్బరుఫాదుషా యంతవానికి ప్రధానమంత్రియై — ఒక వారకాంత కొక్కయుంగరమును చారితోషికమిచ్చుటయే నీ కాశ్చర్యముగా నున్నదా?

విశా:— పారితోషిక మిచ్చుట యందాశ్చర్యమున్నదని నా యభిప్రాయము గాదు— ప్రాణతుల్యముగ జూచుకొనుచున్న తన ముద్దుటుంగరము నిచ్చుట యందాశ్చర్యము లేకపోలేదని. అదియునుగాక నాఁటి సాయంతనమునుండియు నాఁడెప్పుడును నేదో పరాకుగ దీర్ఘాలోచనము సేయుచున్నట్లు తోఁచుచున్నది.

ప్రశాం:— ఆలోచనలకేమి! కార్యభారము పైనబడినప్పుడందర కట్లేయుండును. రాజకీయవిషయముల యందాతని హృదయము మగ్నమైయుండనోపు.

విశా:— అతని బాధించుచున్నది రాజకీయవిషయములు కావనియే నానమ్మకము. కడచిన సాయంతనము నేనాతని దర్శనమునకు బోయినప్పుడతఁడు తనయుద్యానవనమునందుండి యెద్దియో చింతించుచుండెను. ఆయాలోచనయందు మునింగి నారాకనాతఁడెఱుఁగనే యెఱుఁగఁడు. మాసంభాషణము సంభవించినను కనకాంగీమనోహరగానమాధుర్యమును, నాట్యకళానైపుణ్యమును, విశేషించి యామె సర్వాంగ. సౌందర్యమును దక్క యితరప్రసంగములే లేవు. ఇంకను నీకు సందేహమా ?

ప్రశాం:— ఇంక సందేహమున కవకాశమే లేదు. కనకాంగి నాటిన యీ మోహబీజ మంకురించి

మొలకలెత్తినచో నదిమహోపద్రవకారి యగును. దీనినిప్పుడే నిర్మూలించుట మిక్కిలియుత్తమము. సమయమునకు మహానుభావుండగు న య్యాత్మారాముఁడు గూడ నూరలేఁడే! తీర్థయాత్రలనుండి యాతఁడెప్పుడు తిరిగి వచ్చునోగదా!

విశా:—అతఁడును త్వరలోనే రాఁగలఁడు. తులసిదాసు సంగతి యింకను కనుఁగొనవలసియున్నది. నేను గూడ ఛాయవలె నతనివెంటనే యుండెదను. ఎట్టులైనను నతని నీ నీచకృత్యమునుండి మరల్పవలయును.

ప్రశాం:— అది మనకు విధాయకమే.

విశా:— నేనిప్పుడే తులసీదాసునింటికి బోయి నా శక్తి వంచనలేకుండ నాతని మనస్సు ద్రిప్పఁ బ్రయత్నించెదను.

ప్రశాం:— ఇఁక బోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము.

స్థలము:— ఉద్యానవనము.

(ప్రవేశము తులసీదాసు).

తులసీదాసు:—

### కీర్తన.

పల్లవి॥ ఆనంద — మా — నందము.

అను పల్లవి॥ ఆనందసమితి — యా — అతివరూప పతిగన॥
—ఆ॥

చరణం 1. కలదో లేదో చెలి — కాను పథంబే
యిందు బింబమే — సుందరివగు మొగ॥ మా॥

2. కనక లతిక యది — కాంత శరీరమె
కరికుంభములా — తరుణి కుచములే॥ ఆ॥

3. వికచోత్పలములు — సకియ కన్నులా
కోదమ తుమ్మెదలె — మదవతి కురులా॥ ఆ॥

4. అధరబింబమది — మధుర ఫలంబా ?
చిలుక పలుకులవి — కలికివిగావా?॥ ఆ॥

కనకాంగీ ! నీవు నాపై బరపిన నీ క్రీగంటి కటాక్ష వీక్షణంబులు నా హృదయమును గలంచి నన్నల యించుచున్నవి. నీ రూపలావణ్యవిభవాదులఁ గని నప్పటి నుండియు నీ గాన విద్యానైపుణ్యంబు పరీక్షించి నప్పటినుండియు నీ నాట్యకళాకౌశలం బుపలక్షించి నప్పటినుండియు నీ సరససల్లాపాదుల నోలలాడు భాగ్యం

చెన్నటికి చేకూరునో కదా యని నా మనం బారాట మొందుచున్నది.

చం॥ జిలిబిలిపాటలున్ వలపుజిల్కాడి నాట్యకళావిశేషమున్
కలికి మిటారిచూపులును కన్నులసన్నలు తళ్కుబెళ్కులున్
సొలపులు సోయగంబులును చోద్యపునిద్దపు ముద్దుపల్కులున్
గులుకులు చూపి నా మనసు గొంటివి తన్వి యికెట్టులోర్తునే॥

ఉ॥ కన్నులు తుంటవిల్తువిశిఖంబులు చన్నులు పుష్పమంజరుల్
పున్నమనాఁటి వెన్నెలల బోలు మొగంబున మందహాస ము
న్నన్న! కురుల్ మరుల్గొలుపు నద్దిర! ముద్దియ నిన్నుగూడి సౌ
ఖ్యోన్నతి దేలుభాగ్య మొనగూడునె యెన్నటికైన సుందరీ?॥

ఆహా! ఏమిది.

ఉ॥ ఎన్నిదినాలనుండియొ మృగేక్షణ నెయ్య మెఱింగినట్టుగా
మొన్నటి నాటనుండి కను మూసిన విచ్చిన నెల్లవేళలన్
గన్నుల వ్రేలుచుండె గనకాంగి మనోహరరూప మార య
య్యన్నులమిన్న నా కెటుల నబ్బు నికెన్నడు దీరుకోరికల్॥

కలికీ! నిన్నెన్నటికైన గన్నుల కరవుదీరగాంచి, తనివిదీర గాఁగిలించి, ప్రేమాతిరేకంబు వెల్లివిరియ ముచ్చటలాడుచు సుఖించుభాగ్యము నా కలవడునా! అయ్యో! అలవడకున్న నే జీవించుటెట్లు! ఇంకను నా కెట్టియాస! నా యవస్థల నా జవరాలి కెఱింగించువా రెవ్వరు! నన్నా వెలకాంత దరిజేర్చువా రెవ్వరు! ఇంతకును దానిభావ మెటులనున్నదో! ఆకాంత నాపై వలపునిలుపునా! అక్కటా! నే నెంత బేలను! మొన్న

సభాంతరంబున నా లతాంగివిలాసము లన్నియు కన్గంట చూచియు నేనేల సందేహింపవలయు. నిశ్చయముగా నన్నా కాంత వలచియే యున్నది. ఎట్టి సమయమును నేను వెఱ్ఱినై కోలుపోతిని!—

సీ॥ విరజాజిపూబంతి విసరి నవ్వెడివేళ
చెలియకు కనుసైగ సేయనైతి.
పాట పాడుచు నన్ను బల్కరించెడివేళ
చేడెతో మారుమాటాడనైతి.
నృత్యంబుసేయుచు నెనరు జూపెడివేళ
సుదతికి నా నీటు జూపనైతి.
తమిఁ జెక్కునొక్కి గంధము బూయుచోనైన
జెలికి రహస్యంబు జెప్పనైతి.
తే॥ పలుకు పలుకున మోహంబు జిలుకుచుండ
జాణతనమును వలపును జాటుచుండ
నింతిహృదయంబు నిసుమంత యెఱుఁగ లేక
గోలనై దానిచెల్మి బోఁ గొట్టుకొంటి.॥

కడచినదానికి వగచి ప్రయోజన మేమున్నది. ఇప్పు డా కాంతయే కాంతదర్శన మెట్లబ్బును! ఏ దారి తాఁకి యేవారి జేరి యేసామి నోమి యా తరుణీమణి గృహంబుగాంచనగు. అమాత్యుండనగు నేను సిగ్గు విడిచి, యభిమానముడిగి యా వారకాంతగృహము నన్వేషించుచు నెట్లుబోగలను? కాకున్న నా పక్షి లలామ కొక్క లేఖవ్రాసి యంపుదునా? లేఖ నేమని

వ్రాయుదును? దానిని గొనిపోవువా రెవ్వరు? అది
యందుట యెన్నఁడు? ఆకాంత న న్నాదరించుట
యెన్నఁడు? అంతవరకు నే నోరిమిగలిగి యుండగలుగు
దునా? కల్ల! కల్ల! ఐన నిప్పు డేమిజేయుటకును
దోఁచకున్నదే? ఏది దారి!

(ఆలోచన నభినయించును)

(ప్రవేశము విశారదుఁడు)

విశారదుఁడు:— (స్వగతము) తులసీదా సింకను నొంట
రిగ నాలోచనా నిమగ్నుఁ డయ్యేయున్నాఁడు.
రాచ కార్యములయందుగూడ నించుక ప్రమ
త్తుండై యున్నట్లు తెలియవచ్చుచున్నది. నా
రాక నైనను ఎఱుంగకుండునంతటి పరధ్యానము
గల్పించు విషయము దానికంటె మరొండే
ముండును. ఈతని హృదయము నే ననుమా
నించినట్లు మాఱియుండలేదు గదా?

తులసి:— తప్పదు. అంతకంటె వేరు మార్గముదోఁచుట
లేదు. స్వయం దౌత్యమున నేన యా కనకాంగి
యింటికి బోవలయు. అది యిచ్చటికి వచ్చుట
పొసగదు. కనకాంగీ! నీవు నన్నెంత యలజడి
బెట్టుచుంటివే!

చ॥ మనసిజు బాధ కోర్వనిఁక మానినిగేహము జేరి సుందరిన్
గనుఁగొని గాఁగిటం బొదివి కంతుని నెయ్యపుఁబోరునన్ గెలల్

చెనకుచు ముద్దులాడి నును జెక్కుల గోరులనుంచి దాని తీ
యనినును మోవి నానియహహా! యనిసొక్కక తాళు టెట్లొకో.

విశా:— (స్వగతము) అనుకొన్నంతయు నైనది. ఇంక నూరకొనిన ప్రయోజనములేదు. (ప్రకాశముగా) మిత్రమా! వారకాంతా సంగమాభిలాష కర్తవ్యాంశమే యయ్యెనా యేమి?

తులసీ:— (వెఱగుపడి) ఇచ్చటికిగూడ నీవే దాపరించితివా? నేనిచ్చట నొంటరిగా నుంటినని తలంచుచుంటినే!

విశా:— మిత్రకార్య తత్పరులగు మాదృశులు దాపరించని స్థలముండునా? మిత్రమా! నేనుకూడ నీ సంగతి యెఱింగి నందువలన నీకు గలుగు నష్టమేదియులేదు. ఇందు నీవు చింతింప వలసిన యగత్యమేమున్నది?

తులసీ:— "లోకోభిన్నరుచిః" అని యార్యవచనము. నా హృదయరహస్యములనీ వెఱింగితివి. నాకుప్రియము గాదోఁచినది నీకప్రియముగా గనుపించవచ్చును.

విశా:— కనకాంగిపై నీకింత మక్కువ యెట్లొన గూడె? నీవంటి ప్రాజ్ఞులుగూడ సౌందర్యమే పరిధానముగ నెంచి మగువల వగలఁదగిలి యిట్టి నీచ కృత్యంబుల కొడఁబడుట తగునా?

తులసి:— గాఢానురాగమే ప్రధానముగ నేను దానిని వలచితిని. చక్కదన మైచ్ఛికము.

విశా:— గాఢానురాగము కుల కాంతలకే గదా!

తులసి:— వెలకాంతలకు మాత్రము కలుగదాయేమి? వారు మాత్ర మాఁడువారు కారా?

విశా:— (నవ్వుచు) ఏమి వారవనితా గాఢానురాగము!

గీ॥ కలదు చిత్తావి మల్లె మొగ్గలకు నసిన
వల్లికిని గల్గునని చెప్ప టొప్పిదంబె?
సతికి పతిమీఁద ప్రేమ నిశ్చలమనంగ
కులటకది సార్థకంబుగా దలఁప నగునె?॥

కంచు కాగడాలతో బట్టి వెదకినను వేశ్యా కులంబున బశ్చాత్తాపము నిర్మలానురాగము గనఁబడునా? ఎంత వెఱ్ఱివైతివోయి!

గీ॥ ఉర్విఁ బణ్యాంగనకు నెప్పు డొకనిపైన
మానసం బుండదనియెడు జ్ఞాన మకట
లోకవిదితంబ! నీకేటికో కలుగదు
గులకరాలను విలిచిన గలదె సొమ్ము.

బాల్యంబుననుండియు పరమ సాత్విక భావంబున చరించు నీబోటి వానికా నూతన ప్రియాటోప విజృంభణము. నీ సద్గుణ గణార్ణవము పొంగి పొరలి తోడి చెలిమికాండ్ర దుశ్చేష్టలనెడి ద్వీపములను ముంచి వేయునని యెంతో యాశగొని యున్న పండిత ప్రకాండుల కాశాభంగ మొనరింపకుము. పరమ వేదాంత

పరిజ్ఞాతయగు నాత్మారాముని గర్భమున జనించి దుర్విషయ లంపటుండవైనచో నీజననీ జనకులు పరిభవానల తాపంబున తపింపరా! అగర్భ శ్రీమంతుండవగు నీకీ నీచబుద్ధి హేయముసుమా! నిజవంశ నిర్మల యశశ్చంద్రికలకు నీవుగళంకమాపాదింపకుము. ముందు వెనుక లాలోచింపుము. మించిన పిదప వగచిన ప్రయోజనము లేదు. కామోద్రేకమున గన్నుగానక యున్మత్తులై కాంతాలోలురై చెడిన సంపన్నగృహస్థులు వేనవేలు గలరు. వలదు మిత్రమా! నీకీ యభిలాష వలదు.

తులసీ:—విశారదా! నేను చెడుదుననిగదా నీయుపన్యాస సారాంశము! నీవు కనకాంగి సర్వాంగీణ లావణ్య మెఱుంగనివాఁడ వగుటంజేసి యట్లంటివిగాని యొక్కసారి చూచినను దాని మోహవల్లి కలఁ జిక్కనివాఁడుండఁడు. నాహృదయ మాతన్వి దరహాస చంద్రికలలో లీనమై పోయినది. పోక తప్పదు. సన్నద్ధకుము

(పోఁబోవును.)

విశా:— (ఆపి) పిచ్చి వదలినది రోఁకలి తలఁజుట్టుమని చెప్పి నిన్నేమందును. మిత్రమా! నీ వెఱుఁగనిదిలేను. కాని,

గీ॥ మేలివేశ్యల వీధియే మేడిచెట్టు
మిసిమిగల వేశ్యలే యల మేడిపండ్లు
విటులె యాపండ్లఁదిన వచ్చు ద్విజములవియె
దగులుకొని మోహవాగుర తతుల లోను ॥

వేశ్యాగాఢానురాగం బెద నమ్మి తొందర పడకుము.

ఉ॥ పుట్టదు మోహమంతయును భోగము దాని మనంబులోపలన్
పుట్టదు పుట్టెనేని నడిపోవును కొన్ని దినాలలోన నే
ఆట్టిటు పెక్కుమంది నడయాడెడు మార్గమునందు గడ్డి దా
బుట్టను పుట్టెనేనియది పొంగుపడంగలదయ్య ? నెచ్చలీ ! ?॥

ఆ ప్రయత్నము మానుము. నీవంటివాని కిది తగనిపని.

గీ॥ బ్రహ్మకులమునబుట్టిన భాగ్యమేమి !
చదువు సంధ్యలబాసి సత్పథమురోసి
సాని సంపర్కమాపించి మానధనము
గోలుపోయిన నేమి చేకూరునయ్య.॥

నామాటలాలింపుము. శాంతమువహింపుము. విషయేచ్ఛ మానుము. మాసిన నీ మానంబు దక్కు. లాఁతివిధంబైన నవమానంబుదప్పదు. వారకాంతా సంగమము శాస్త్రదూష్యంబు గదా ? యోజింపుము.

**తులసి:**— ( కోపముతో ) ఏమీ ! నీ వాచాలత్వము మేరమీఱుచున్నదే ? అమాత్యుఁడగు తులసీ

దాసునింత వ్యర్థునిగ దలంచుచుంటివే? వారాంగనాసంపర్కంబు శాస్త్రదూష్యమా?

గీ॥ వారకాంతాసమాగ మాచారదూర
మా? యిదినిజమా? హేయమా? మాదృశుల కు
తూహలా వరోధమునకు ధూర్తులైన
పండితమ్మన్యులు వచించు పల్కుగాక ॥

రోవెలంది పొందునాకువిందు. పాపముకానిమ్ము పుణ్యము కానిమ్ము.

గీ॥ పదవిబోయినగురుఁడు దుష్పథమటన్న
సిరులఁదొలఁగిన వంశపుం బరువుచెడిన
వెలవెలందుక నెయ్యంబు వలచినాఁడ
పోకతప్పదు, తప్పిన పోవుసురు ॥

( నిష్క్రమించును ).

విశా:— ఔరా? వేద వేదాంగాధ్యయన మీరీతి ఫలించెనా? అమృతము హాలాహలముగా బరిణమించెనా? నీతిపథసంచారి అవినీతిపథగామియయ్యెనా? ఎట్టి వాఁడెట్టి వాఁడుగా మారె!

సీ॥ చలిచీమ కేనియు నలియఁ ద్రొక్కనివాఁడు
సర్వంబు సమముగా జూచువాఁడు
కలనైన ననృతంబు బలుక నేరనివాఁడు
పలుకుల నమృతంబు జిలుకువాఁడు

వేద వేదాంగాది విద్యలుగలవాఁడు
గలవాఁడు సద్గుణంబులు గలాఁడు
జానకీహృదయేశు చరణకంజంబులు
తలఁపున సతతంబు నిలుపువాఁడు

గీ॥ తులసిదాసను విఖ్యాతి గలదుగాని
సచివుఁడయినంత నే నైజ సద్గుణములు
దుర్గుణములయ్యె గాఁబోలు స్వర్గమబ్బ
నైష్ఠికుఁడె జారుఁడౌఁగాదె వాకమునను.

చతుష్షష్టికళల సాంగోపాంగముగా నభ్యసించిన పుణ్యపురుషుఁడు తుచ్ఛమగు భోగి భోగమాసించి పౌర్వాపర్యములెఱుంగక స్వయముగా వేశ్యాంగనా గృహంబున కేగుటఁజూడ విధిచెయ్దములు విచిత్రముగా దోఁచెడిని. కాదామరి.

వ॥ ధనహీనుండు ధనాధినాథుఁడగు నిర్దాక్షిణ్యచిత్తుండు సజ్జన మాన్యుండగు నిర్వికల్పకతపస్సామ్రాజ్య ధౌరేయుఁడౌ మునిచంద్రుండిలఁ జంచలుండగు నదేమోహభ్రాంతియేగాని యెవ్వనికిన్ శక్యముగాదు ధాతృలిఖిత వ్యాశక్తి దప్పింపగన్ ॥

( నిష్క్రమించును ).



## తృతీయ రంగము.

స్థలము :- గృహాంగణము.

(ప్రవేశము కనకాంగి, ఇందుముఖి)

కన:— చెలీ! నన్నూరడించుటకట్లు పలుకుచున్నావు గాని నిజముగా నాతఁ డొక్కరివంటివాఁడు కాఁడే?

మ॥ సుగుణోపేతుఁడు పాపభీరుఁడు యశస్యుండున్ మహాపూజ్యుడున్
భగవద్భక్తుఁడు నిర్మలుండు మమతాబద్ధానురాగుండు విం
తగ ధర్మైకపథానువర్తి తులసీదాసుం డమాత్యుండు పె
న్వగలన్ జిక్కెనె మోహముంచునె సఖీ నావాంఛ లీడేరునే॥

ఇందు:— కనకాంగీ! విరహాతిరేకమున నీ కట్లు తోఁచుచున్నదిగాని యీతఁ డొకలెక్కయా?

గీ॥ సర్వసంగ పరిత్యాగు లుర్వి నెంత
మంది స్త్రీలను గని బ్రతిమాలలేదు?
సకియ! వేశ్యలమోహవల్లికలఁ జిక్కు
కుండ నెవ్వాఁడు తప్పించుకొనఁగలాఁడు?

అదియునుంగాక

సీ॥ వలపులుగులుకు నీ వాలు జూపులగలం
గక యుండగా వినాయకుఁడె వాఁడు
విరిచెండ్లగెలచు నీ మెఱుఁగుబాలిండ్లకాం
తుల గెల్వఁగ హనుమంతుఁడె యతండు
నిండుపున్నమమించు నీ మందహాసచం

క్రీడల కోరువఁగ నాశకుఁడెవాఁడు
అలివాలికాజాలముల నవ్వ నీ కచ
రుచులఁదాల్మి వహింప గచుఁడెవాఁడు.
గీ॥ ఎన్నఁడును మున్న పరభామ నెఱుఁగనట్టి
గోలయాటను నిందుపేరోలగమున
ఎలచియును నిన్ను హృదయంబు దెలుపనోడె
ఒంటిమైనున్న నెగఁబడకున్నె మున్నె?

నీవిలాసము లాతని హృదయము నాకర్షించిన వనియే నా నమ్మకము. ఘాదుషాదర్బారు నందా తనిప్రవర్తనమంతయు దాని కనుగుణముగనే యున్నది. ఇప్పు డాతఁడుగూడ నీకై పరితపించుచున్నాఁడేమో నీ కెట్లు తెలియును?

కన:— ఏమిజాణతనమే! మాటలతోడనే మొక్కలు మొలిపించుచున్నావు!

ఇందు:— మొక్కలుమొలచి పూవులు పిందెలు కాకుండనే తన ముద్దుటుంగరమును నీ కిచ్చె ననితలంచితివే? అతఁడు నీవలలో దగుల్కొనుట నిక్కువము. ఇఁక నెక్కడికి పోఁగలఁడు?

కన:— ఇందుముఖీ! నీవు నన్నూరకే యానపెట్టు చుంటివే! ఒకవేళ నన్నాతఁడు వలచి యున్నను,

గీ॥ ప్రాణములకంటె నెక్కుడు ప్రాణమనుచు
విందు మమతాలతాంగి యా సుందరునకు

చక్కదనముల ప్రోవు నా సకియ వీడి
యేలవచ్చునె నాపై విరాళిబూని.

ఇందు:-- ఓసీ! నీవెంత బేలవే! నిరంతరంబును మనయిండ్ల కడ కుక్కురములవలె గాచియుండు నీబోజుంగు మూఁకల సతులందఱను గురూపలనుగా దలంచుచుంటివా ? సఖి! యింట రంభలవంటి సతులున్నను దూరపుకొండలు నునుపగుటచే మనల ననుసరింతురు. రూపవతులగు భార్య లున్నంత మాత్రమున వేశ్యావిముఖులేమైన బోగినకాంగీ! మనకిఁక 'జీవితాశయే లేదు. మేళసమయముల యందలి మన కృత్రిమసౌందర్యమే గదా వీరి నాకర్షించునది. లేకున్నచో లోకమున నితర సతులకంటె మన మేమంత సుందరులమే?

కన:— అవును గాని

ఉ॥ కొందలమందు డెందము సఖుల్ ననుఁజూచి హసించి "యూరకే
అందని మ్రానిపండు కొఱకాసపడించి యిటుల్ మనోవ్యథన్
గుందిన నేమి లాభ మెనగూడునె! మంత్రి యిటేలవచ్చు న
మ్మందగదన్మ రూపజితమన్మథుఁడా తఁడు రాఁడు రాఁ" డనన్.

ఇందు:— సఖులపలుకులకే యింత యలజడి నొందవలయునఁటే? పుట్టినది బోగముపుట్టుక గాదఁటే?

కన:— తలంచుకొనిన కొలఁదిని నాకే సిగ్గగుచున్నదే? ఏమిచిత్రమో గాని నిముసమున కెంతరమీఁదనో నెనరుంచు నాకు నాఁటనుండియు నితరు

లను గన్నెత్తి చూచుటకైనను మన సొప్పు కున్నదే? ఏమి సౌందర్యమే ?

గీ॥ ముద్దుగుల్కెడి యా నగుమోము జూచి
సోయగము జూచి నాసిక సొబగు జూచి
మోవిజిగిఁజూచి చెక్కుల మురువు జూచి
కలఁతజెందరె ? రంభాదికాంతలైన.

వాఁడే నన్ను గామించి నా ముచ్చటలదీర్చు నదృష్టమే నాకు లభించినచో చెలీ ? యిఁక నాకు గావలసినదేమున్నదే ?

గీ॥ పురుషులేనట్టి లోకైక మోహనుండు
సాటిలేనట్టి మేటి యైశ్వర్యయుతుఁడు
మనసుమంచిది వితరణ మతియుగలదు
లేమ ! నాకంటె భాగ్యశాలినిగలుగునె ?

ఇంక నీ చిల్లరవిటులకై నే నానపడ నక్కఱ లేదు.

ఇందు:— నాల్గు దినములవర కట్లేయుండునే. పిదప "ప్రాత యొకరోత క్రొత్త యొకవింత" యగును. మహేంద్ర వైభవుఁడగు నక్బరుషాదుషా యంత వాని మరగినను అలవాటుపడిన మన సూరకుండునే ?

కన:— సఖీ! యీతనిపట్ల నట్లు గానేరదే ?

ఉ॥ ఎందఱజూడలేదె యిఁక నెందఱిజూడనె ? దానికేమి యీ
సుందర మోహనాకృతియుఁ జొక్కపుఁబ్రాయము సోయ
గంబు న్డే]

నెందునుగాన నింతవరకెవ్వఁడు నన్నిటు వేఁచలేదె ? నా
డెందము దొంగిలించె నతఁడే యిఁకవానిని మానజాలనే ?

వానిరూపు నాకుకన్నులగట్టినట్టే యున్నదే ?

గీ॥ మేల్మి యపరంజిగెల్చు నెమ్మేనిచాయ
గండుమీలను గెల్చు నా కన్నుదోయి
దాడిమీబీజముల గెల్చు దంతపంక్తి
హృదయము గలంచు చున్న వే నెటులనైతు ॥

ఉ॥ చందురు గేరఁజాలు ముఖసంపద కన్నులు చేరఁడేసి యా
యందము జెప్ప గిప్ప దరమా ? సతిపుట్టువు పుట్టినప్డు నా
సందిట వానిజేర్చి బిగిచన్ను లురమ్మునఁగ్రుమ్మి మోవితీ
యందన మాని కూర్కవలదా క్షణమైన సరోరుహేక్షణా ?॥

ఈ విరహసాగరము నీఁదు టెట్లు ? ఈపువ్విలుకాని బారినుండి తప్పించుకొను టెట్లు ? మదనా ! అబలనగు నా యెదుటనా నీ ప్రతాపము జూపవలసినది.

చం॥ ముగుదల నమ్ముఁ నేఁచియశమున్ జనమున్ వృథపుచ్చనేల ? ము
జ్జగములగెల్చు మేటిబలశాలి నటంద్రు రమాకుమార ! నీ
మగఁటిమిజూపనెంచిననమాత్యుని మార్కొనితూపువేయఁగా
దగదొకొ ? నావగన్ దులసిదాసుఁ దగుల్కొనఁజేయరాదొకో !॥

నా మాటవినుము. ఇంతవరకును నాఁడు దాని మాటవిని చెడిపోయినవాఁ డెవ్వఁడును లేఁడు. నీవుగూడ నీ కాంతమాటలఁ జెడ చెవిబెట్టి యేగ గదా నాఁడు ముక్కంటి కంటిమంటల పాలైతివి. ఓరీ ! నీ రూపు మాపినను నీ సహజక్రౌర్యమును విడువవు గదా ? నీ ప్రతాప మా తులసిదాసుపై నేల చూపఁజాలవు ?

గీ॥ వాని సౌందర్యమునుగాంచు వారలెల్ల
దలిరు విల్తుఁ డనంగుఁడు తులసిదాసు
రూపిజిత మదనుఁ డన పౌరుషములేదె?
శౌర్యముండిన వాని సేఁచంగ రాదె?

ఓరా! సతీతపః ఫలంబున బ్రతికియు సతులనే యేఁచు మహాపాతకిని నిన్నేమనిన నేమి ప్రయోజనము. ఓరా! శశాంకా! నీకుగూడ నాపైపగ యేలరా! నీవేడి వెన్నెలలచే నన్నేల బాధించెదు. చేతనైన నా జగన్మోహనుండగు తులసి దాసునకు నావల పెఱింగింపరాదా? ఆతనికడ నీ ప్రభావము జూపరాదా? ఇది యన్యాయముగాదా? అయ్యో! గురుపత్నినైన గూడు నీ మహాపాతకునకు న్యాయాన్యాయ విచక్షణ యెక్కడిది? సహజముగ కళంకివి. అన్నివిధముల దోషాకరుఁడవు. అందువలన నిప్పుల చెఱఁగు నీవేడిమి మహాభాగుఁడగు తులసిదాసునకు గందపుఁ బూతకంటె జల్లగా నున్నదిగాఁబోలు! అన్నా! యమునా నదీతరంగముల నూఁగి యూఁగి నా సుందరోద్యానంబున పుష్పవాసనల నెల్ల జూరగొని మోహోన్మత్తుండవై నా చెక్కిళుల ముద్దాడుచు నాపయింట దొలఁగ దీసెదవేలరా? ఓరీ! మందమారుతా? వెల చెలియనైన నీకింత తేలిక యైతినిరా! సఖీ! ఇందుముఖీ! ఇంతలో నెక్కడికి పోయితివే? ఈ శుకపికారవంబులు నన్ను జీవింపనీయవే. సమయమున కీ తుమ్మెదలుకూడ నెక్కడదాపరించినవే. అయ్యో! అయ్యో!

ఇందు:— కనకాంగీ! ఇదేమి వైపరీత్యమే! పురుషులు వలపింపరా? స్త్రీలు వలవరా? వారకాంతవయ్యు నీకింత భ్రమ జెల్లునే?

కన:— చెలీ! నేనింక వానినిజూడకుండ నుండఁజాలనే! వెంటనే వానిసదనంబునకు బోయి వాని పాదంబులపై బడియెద. ఈ మారుఁడు క్రూరుఁడై నన్నలయించుచున్నాఁడే! వీని శరంబులబారి నుండి తప్పించుకొనవలయు నన్న వాని శరణంబు వేఁడక తప్పదు. అయ్యో! వానిని గూడకున్న నా ప్రాణంబులు నిలువవే!

ఇందు:— కనకాంగీ! నీకు మతిపోవుచున్నట్లున్నదే!

గీ॥ సుందరాకారుఁడని వానిపొందుగోర
పాటిలేమలు నవ్వరే సకియవిన్న?
ఆకట యెదురొడ్డి చదరంగ మాడెదో కొ,—
చాలుచాలిట్టి వెడగువాంఛలు లతాంగి!॥

చ॥ వలపదియెంతయున్న మగువా వెలచేడియ నేస్తగానికిన్!
తెలియఁగనీయరాదు కడు తేలికయౌ జాణ దాన; వాఁడ రా
వలయును నీగృహమ్మునకు వారక నీవటకేగితేని ని
న్నలుసుగ జూచునమ్మ తగదమ్మ యిటుల్ దపియింప నింతిరో॥

చెలీ! ఊరడిల్లుము—

చెలీ! అదే పురుషుఁ డెవ్వఁడో మన గృహాభిమ్ముఖుఁడై వచ్చుచున్నాఁడే!



కన:— చెలీ? యెక్కడే? యెక్కడే!

ఇందు:— అదేమే! యీ గవాక్షమునుండి తొంగి చూడుము. అదుగోనే మన ద్వారముకడ.

కన:— ఔనే? వాఁడేనే! వాఁడే!

ఉ॥ సుందరి వాఁడె హావ్యాదయచోరుఁడు మన్మథమన్మథుండు సం
క్రందన నందనాదిఘనులన్ విరసించుమనోజ్ఞమూర్తి న
న్నుం దయఁజూచినాఁడెకరుణోజ్జ్వలుఁడే యిఁకజాగుసేయ నే
గ్రంథుగ వానిదోడుకొని రావలె నింతటి మందయానవే ?॥

నా నోములు ఫలించినవి. నాకోరిక లీడేరినవి. నే నిదే వచ్చెద.

(నిష్క్రమించును).

ఇందు:— ఔరా! దీని నూరడించుతలంపున నే జెప్పినజోస్య మెంతత్వరలో నిజముగా బరిణమించినది! కనకాంగీ! అదృష్టమనిన నీదేనే! వీని రాకదలంచిన నాకే యబ్బురమగుచున్నది! ఇంక నీసామ్రాజ్యకోశాగారమున నున్న ధనమంతయు మా కనకాంగి శయనాగారమున చేరవలసినదే? ఇంక నీ తులసీదాసు పాదుషాకొలువు చాలించి దీని పదసేవ జేయుచుండవలసినదే! ఎట్టులైనను వీని కిది వలపుమందులు తల కెక్కింపకమానదు! సాటి భోగమువారిలో దీనిని మించునది లేదు. ఔరా యెంతటిదిట్ట! అదిగో!

అప్పుడే చేయిలో చేయి గలిపినది! ఇంక వాఁ
డెంతటిజితేంద్రియుఁడైనను దీనిచేతిలో కుక్క
పిల్ల కాకమానఁడు. అరుగో! యిరువురును
నిటే వచ్చుచున్నారు. ఇఁక నే నిక్కడుండుట
యుచితము గాదు.

(నిష్క్రమించును.)

(ప్రవేశము కనకాంగి, తులసీదాసు).

కన:—— దేవా! యింను దయచేయుఁడు

(తులసీదాసు ఆసీనుండగును.)

శా॥ వీరాగ్రేసరు లేలవచ్చిరో యిటుల్

తుల:- వే వారుసాలంబుకై

కన:- ఆరాటంబెటు సాగనుండెనో గదా

తుల:- అలంబిటన్ సాగునే

కన:- ఆ రా జెవ్వఁడు మిమ్ము మారుకొనగా

తుల:- ఆ మార భూపుండె జూ

కన:- ఆ రాజున్ గెలువంగ నెట్టులగునో

తుల:- అబ్జాక్షి నిన్ గూడుటన్॥

కన:-

ఉ॥ మేలు! భళాభళీ అహహా! మేటి సుమంత్రులు శౌర్యవంతులే
పాలనధీరులే పలుకు బంగరు మాయెనొకో సభాస్థలిన్-
జాలును జాలు నివ్వగలు జాల కుతంత్రము జేయవచ్చిరే
పూలనురువ్వ నాఁడె చటబోయెనొ యీయనురాగ సంపదల్॥

తుల:—— సఖీ! అలనాటినుండి

మ॥ లలనా! నీమధురాధరామృతము గ్రోలన్ భ్రాంతిపుట్టంగ నా
వల పింతింతనరానిదై ప్రబలమై పంచింప నీరీతి నీ
వలలో జిక్కఁగ వచ్చినాఁడనుజుమీ పల్మారుముద్దాడవే
తిలకింపన్ వలరాయువాలమున నింతీగాలు జే జే యునన్॥

తరల॥ తలిరువిల్తుఁడు కూరిరుడే యిఁక తాళఁజాలని సుందరీ!
కులుకుగుబ్బ లురంబునందున గ్రుచ్చి కౌఁగిట జేర్పవే.

కన:- అలరు బ్రాయము మీరు బొందిన నండజేర రికెవ్వరున్
ఇలను నే వశీయింప నోలిగ నిమ్ము సొమ్ము మనోహరా!॥

తుల:- కనల నేటికి కంబుకంఠిరో! కాంక్షితంబగు హారమున్
గొనుము మారుని మార్గణం జతిగూడుమా నను నేలుమా!

కన:- కనల నేటికి!

తుల:- హారమియ్యదె!

కన:- గౌరవం బెటు!

తుల:- యింతిరో!

(హారము వేసి)
కనులపండువు జేయుచుంటివి కౌఁగిలింపవె ప్రీతిగన్॥
(అనిముద్దు పెట్టుకొనుచు)

కన:-

మ॥ అదిరో కేళిగృహంబు నల్లదిరో పర్యంకంబు నా పూలపా
న్పదె! యా సెజ్జను జేరి నీహృదయ మింపారంగ నాపగ్గె జా
వుదు పుష్పాస్త్రుని కేళియందు; నిఁక నామోహంబు నిల్వంగనీ
యదురారా? సుకుమార! ఏలుకొనరా! అలస్య మింకేలరా॥

(ఇద్దరు నిష్క్రమింతురు)





# గోస్వామితులసీదాస నాటకము

## ద్వితీయాంకము.

### —• ప్రథమ రంగము. •—

స్థలము:— ఇంద్ర ప్రస్థము — అంతఃపురము.

( ప్రవేశము రామాబాయి. )

రామాబాయి:— (విచారముతో) అకటా! ఎంతటి వైపరీత్యము సంభవించెను.

గీ॥ నేటివఱకు కన్న దన్యవధూటి గన్న
నాకు మారుగ జూచెడు నాథుమారుఁ
డక్కటా! ఘరుమాయలఁ జిక్కువడెనె?
మమత మఱచెనె! యాల దాని మరగినాఁడె!

సహజముగ రాజకీయ విషయముల యం దప్ర మత్తుండై చరించు చుండును గావున నేదేని రాజ కార్యంబున నియోగింపఁబడి యింత తడవు మసలుచుండె నని తలంచితినిగాని అయ్యో! ఆ కనకాంగి మోహ

వాగురలఁ దగుల్కొని ప్రపంచమునే మఱచి యుండెనని తలంపనైతిని. పరిశాంతుని పుణ్యమా యని యతండు వచ్చి చెప్పిపోయెనుగాని లేకున్న నాకీసంగతి యెట్లు తెలియును? కటకటా! విశారదుఁడన్న నా తులసీ దాసునకు ప్రాణము. వాని మాటలుగూడ చెవిబెట్ట లేదా? ఇదేమి పాపమురా! నాయనా! పాలవంటి కులము నీవలన నీరై పోవలసినదేనా? సమయమునకు మీ తండ్రిగారు కూడ నింటలేరే! ఏళ్లు హెచ్చినకొల దిని బుద్ధిపెడతల బట్టుచున్నదిరా? అయ్యో నేనేమి చేయగలను. హా దైవమా?

గీ॥ ఆజ్ఞాభంగి సుతుఁడు వెలయాలిగూడె
నొరుల మాటవినఁడు; పతి యూరలేఁడు
కోడలేమియు నెఱుఁగని గోల; ఆఁడు
దాన నికతి నేనిందు దడయఁ జెడదె॥

ఇట్లూరక చింతించుచుండిన నేమిప్రయోజనము. దినములు గడచిన కొలఁదిని వాని స్వభావము మఱింత మాఱిపోవునుగదా? ఇప్పుడచ్చటి కెవ్వరిని పంపిన నేమి ప్రయోజనము. అయ్యో! కన్నతల్లినగు నామాట నతఁడు త్రోసివేయగలఁడా? నాపలుకులువినియు నావెలఁ దిని తేరిచూడ సాహసించునా? కావున నా కనకాంగి

గృహంబునకు పోవుదునా? కటకటా? ఆత్మారాము
నంతటి వానికిల్లాలనై మహామంత్రికి తల్లినై నేనే
మొగము బెట్టుకొని నీవా? నీవా? యని త్రోవవెదకు
కొనుచు నా వేశ్యాంగనాగృహంబున కేగెద.
అయ్యో యిప్పుడట్టి యూహలఁ బెంచుకొనిన నాముద్దుల
కుర్రడు చెడిపోవునుగదా! పతి తరువాత సుతుఁడేగదా
నా ప్రాణము. అయ్యో! చూచుచుఁ జూచుచు నాచిన్న
వాని నా మాయలాఁడి కెల్లర్పింతును. పోక తప్పదు.
గత్యంతరము లేదు.

(తెరపడును.)



## ద్వితీయరంగము.

స్థలము:— వేశ్యాగృహాంగణము

(ప్రవేశము—కనకాంగి తులసీదాసు).

కనకాంగి:— నేనుమాత్రము మీ సందర్శన సల్లాపంబుల గోనక నిముసము మసలుదాననే!

తులసీ:— నీకు నామీఁద మోహమగ్గల మాటయే నిజమైన యొకక్షణమైనను విడనాడనని బాస చేయుము.

కనకాంగి:— మణిగణనికరవృత్తము

కనగను మరుసరి కరుణనుగనుమా!
మనమున నిలిపెద మమతను వినుమా।
జననియు నలదన జతవిడ నెపుడుం।
జనవర సతతము సరసత గనుమా॥

(చేతిలో చేయివైచును.)

తులసీ:—

మణి॥ మమతను బెనగొన మరిమరి రతులం।
తమిమది బెరుగగ దడయక సోకలై।
సమముగ ననముల శ్రమగన కిపుడే।
కమల జనయనరో కదలవె యటులం॥

(పరిక్రమించుచు).

సుందరీ! ఇటుచూడుము.

రగడ॥ కనకాంగీ! అదె! కమ్మనితావుల।
నర పుష్పంబుల • నరలెడుధామము।

కన ॥　మన మోదంబును ♦ మాటికిఁ దెల్పెడు
　　ఘనలతికలుఁగడు ♦ గాఢతఁ బ్రాకుచు ।
తుల ॥　చిలుకలపలుకులు ♦ చింతలఁ బాపఁగ
　　సలలితముగ ఘన ♦ శారికలాడెడి ।
కన ॥　కల కలలాడెడు ♦ కంజంబులఁగని
　　పలుపున భృంగము ♦ పడి నరుదెంచెడి ॥

( ప్రవేశము రామాబాయి )

హా! కుమారా తులసీ!

ఇది నీకు తగునటరా నాయనా! ఇది నీ వంటివాఁ డుండవలసిన స్థలమేనా? ఏమి! నా రాకకై యేనా నీవు నిర్వైరపడి చూచుచున్నావు? అప్పుడే లోకు లెల్లు చెప్పుకొనుచునారో నీకు తెలియునా? నలుగురిచే వ్రేలఁ జూపించుకొని పదుగురినోళ్లలో బడిన పిదప యిఁక జీవించి ప్రయోజన మేమున్నది? ఈ లోకనింద నీవు సహింపఁజాలవు. అయ్యో నేనుకూడ సహింపఁజాలను. వదలుము. దాని చేయి విడిచి పెట్టుము. నా ముద్దుకూనా ఎంతలో నెంత జరిగినదిరా? రమ్మా! పోదము పద! ఏమి మాట్లాడవు! అయ్యో నామాటలు నీకు వినఁబడుట లేదా? వినఁబడిన నీవేల కదలవు. నాయనా! నీ జనకులు వినిన నేమనుకొందురు. అయ్యో! యిఁకనైనను కదల వేమి? ఇచట నీవుండగా నేను జూడఁజాలనురా? నడువుము! ఇంటికి నడువుము! ఇది నీకు తగదు.

ఉ॥ పాడి బుధాళికైన బరిపాటిగఁ జెప్పఁగలాఁడవన్నిటన్
బోఁడిదవు నీవెఱుంగవొకొ పూఁచిన తంగెడు పోలు నింట నీ
చేడియ బల్ నవోఢయు సుశీల పతివ్రత గల్గ నిట్లురా
గూడునె రోఁ వెలందికడకున్ దనుహానియు లోకనిందయున్ ॥

సీ॥ కులకాంత నెడఁబాసి వెలకాంత సంపర్క-
మాసించుటన్న దుర్వ్యసనము గాదె!
దుర్భగంబులఁ గోరి దురితక్రియలమీఱి
తండ్రికి తలవంపు దలఁప నగునె!
విజ్ఞానఖనివని వినుతిఁజేసెడి ప్రాజ్ఞ-
లెబ్బంగి నిపుడు సహింపఁగలరు?
మంత్రితో దుర్మంత్ర తంత్రజ్ఞుఁడైనచో
నాదరించునె నిన్ను బాదుషాహి?
శాస్త్రవేత్తవుగద। దురాచరణమనుచు
దలఁపవైతివె? నీబుద్ధి కలఁత పడెనె?
పామరుని భంగి విషయ లంపటుఁడ వగుట
కౌరవి చేకొని తలగోకి కొనుటగాదె?

తులసీ! లెమ్ము! మనఃసుందిరమున మమతగూడి యుందువుగాని రమ్ము! రాకుంటివేని రారాపులువచ్చు. నామాటవినుము. ఇఁక లెమ్ము!

తులసి:— వృత్తము.

రాచేరా నే రాపుల్ రానీ। కానీ కార్యాకార్యంబైనన్,
పోనీ రానీ పోరాటంబుల్। పానిన్ బాయన్ జాలన్ దల్లీ॥

రామా:—

ఉ॥ కారణమేమి రావనేఁగ

తుల:- కాంతను బాయుఁగఁ జాలకుంటచే

రామ :— మేరదిలేచ మక్కువకు?

తుల:- మేటినువస్తువులందు లేదుగా!

రామ:— కారుణికుండవై మమతగాంచిన యీకనకాంగికన్న వే
కారులు మిన్నసుమ్ము!

తుల:- కనకాంగికిఁబోలునె కాలిగోటికిన్.

రామా:— తనయా! నీబుద్ధివైపరీత్యమున నట్లున్నది గాని మమత యందుగల అంద చందంబులు విద్యానైపుణ్యము పాతివ్రత్యప్రభావము నీ పడపు కత్తెయందు గలవే? కొంచె మాలోచించి చూడుము.

గీ॥ గగన మెన్నెన్ని రంగుల గానుపించు
నద్ద మెన్నెన్ని ప్రతిమల నమరుచుండు
ఛాయ లెన్నెన్ని విధముల జరగుచుండు
మోహ మారీతిగాదొకో భోగస్త్రీల॥

మ॥ వలపాశూన్యము మోహమానటనదుర్వ్యామోహమా మెందు భా
సిలు మానంబును మంటఁగల్పుధనమాపించుక మహావ్యాధులే
కలకంజేయును; దేహకాంతిచెడు దుష్కాంతాళిసాంగత్యముల్
ఎలదోపుత్రక! చాలు తుచ్ఛదమగు నీవాంఛాలతన్ వీడుమా!

మఱియు,

తే॥ తల్లిదండ్రులఁ బాపు విత్తము హరించు
అలిసెడఁ బాటు సేయు గయ్యాలు వెట్టు
జపతపంబులఁ మాన్పును; జాలు చాలు
తనయ! వెలకాంత గోరంగ దగదు తగదు॥

ధృవకోకిలా వృత్తము.

తనయ తరలుము - తగదు మసలుట తండ్రి వేఁడెద రాగదే।
తులసి:- జనని విడువఁగ జనదు నిముసము చాలు దరలుము వేగమే।
రామా:- ఘనమె యిటువలె గదలకను ఘనకార్యమేమిరయి త్రిరా
తులసి:- మనకులర సుఖమిటులఁ గోనియెద మార్గ్యానందగు దీనినా॥
రామా:- కొనుము సుఖముల కొలది మమతను గూడి నిత్యము హాయిగా
తులసి:- కనలకుము అటు కదలు జననిరో కాదు కివిటనుండగా
రామా:- తనయ మరలక తడిసినను దలఁ దండ్రి తీయును విన్నచో
తులసి:- కనగనయితె నె కదలవలసిన ఘాతమప్పుడె చెందెదా॥
రామా:— కన్నతండ్రీ! నా మాటవినవా?

కం॥ రావా యింటికి పుత్రా।
లేవా నితండ్రి పేరు తేజము గొనవా।
సేవా ఫలమును గనవా
నీ వీ నిచంబు మాని నియతింగనవా? ॥

నీపుత్రవిధి యింతటిదేనా? కన్నతల్లి బ్రతిమాలు కొనఁగా దనవచ్చునా?

సమనవృత్తము

రారపుత్ర యింటికిటుల్ మేర మీరనాయమొకో
క్రూర సర్పరాజములే—ఘోరవేశ్య లీవిధమే !
దీనతఁ గృశించుచు నీ చాన దుఃఖమొందెడిరా!
దాని మానరాదుర నా— యాన సుమ్ము రమ్మికఁ
పాదుపాను వేఁడుకొనఁ బాదుకొల్పు కీర్తిగనఁ
కాదు బుద్ధిపీడుమీఁకఁ— వాదమేల లేచిచనఁ ॥

నీకు మంచిచెడ్డలు తోఁచుటలేదా? అయ్యో! నీ యుచ్ఛ్రస్థానంబును జూచి యసూయాపరులెవ్వరైన ప్రయోగంబును జేసి యుందురా! సందియము లేదు! అట్లు లేగాకున్న ఎన్నడును నామాట జవదాటి యెఱుఁగనివాఁడు నేనింత జెప్పుచున్నను మౌర్ఖ్యము వహించునా? వీనివిశేష విద్యాధికములవలన గన్నెర్రిచే నెవ్వరో యిట్టిబెట్టిదపుఁ గార్యమొనర్చి యుందురు. కుమారా!

కీర్తన

పాపముసుమ్మా! పరసతి రమ్మా! పాడఁడనిందసుమా
తాపము నాపుము — కోపము నార్పుము

తులసి:— పాపంజానే— పరసతియైనన్— సమసతి గాదటవే
జననిరో ! చనుమిక —. జడియుకు వదలఁ

రామా:— సానులగూడఁ—సతులనువీడఁ — జాలవెరానుతుఁడా
తనయుఁడ— తరలుము— తరుణిని—గనఁగఁ

తులసి:— ఇంతిని వీడఁ— ఇంతినిగూడఁ— ఇంతట నే జెడనే
తరుణిని— విడువను— తరలను— పదవే!

రామా:— కడుపుతీపిచే నేనెన్ని విధముల బ్రతిమాలు
కొనినను నీకు తెలియుటలేదురా! అయ్యో!

గీ॥ అరయ వేశ్యా గృహంబు యమాలయంబ
దానిఁజొరఁబోరు పరమపాతకులె గాని
దుస్సహదురంత దుర్వార దుష్టరోగ
బాధలరయ విలయశిఖిజ్వాలలెసుఁడి॥

తలంచుకొలఁదిని కడుపు తఱుఁగుకొని పోవు
చున్నది. పురుషాగ్రగణ్యుండ వగుదువని యెంచితిని
గాని ఇట్లుధనకాంతా దాసుండ వగుదువని కలనైన
తలంపలేదురా! పేరుప్రతిష్ఠలులేని యీజన్మపంకిపుర్వ
చందంబేసుమా? కులాచార భ్రష్టుండవై ఆర్యాశీర్వ
చన దూరుండవై కుమతి జన లోలుండవై కులటలం
గూడి కులంబు కూలదీయు కులనాశకుండవుగాని కుల
శేఖరుండవుగావు. బ్రాహ్మణజన్మమెత్తియు భ్రష్టుండ
వై బ్రహ్మతుల్యుండగు జనకుని పేరుమంట గలుప నెం
చితివే! క్షణభంగురంబులగు నీ తుచ్ఛసుఖముల
కొఱకై ఆచంద్ర తారార్కముగ నుండు కీర్తిని బోఁగొ
ట్టుకొందురే! హా! దైవమా! నేనెన్ని చెప్పినను నాప
లుకు చెవిబెట్టఁడు. నేనేమి సేయుదును.

చం॥ వినఁడొక యించుకైనను వివేకము దెల్పఁ దలంతియైనదా
గనఁడొక బుద్ధిజెప్పినను కాముకుఁడై జరియించు నిట్లనా
జననిగ నెంచఁడయ్యె చెడుసానికిలోఁబడె యింట జిక్కి-నా
తనయుని ద్రిప్పఁగాదరమె! దైవము! సాయము సేయుమి త్తరిన్!

అంతయు శ్రీరామ చంద్రునిదే భారము.

శా॥ కామాసక్తుఁడు నాతనాథుఁడు వీకన్ దుష్టుఁడై యుండినా
నీవుం బెంతయు వీటబుచ్చెనయయో! నేనెంత భోధించినన్
కామాసక్తి పరిత్యజింపఁ డకటా కాపాడి రక్షింపవే
సామంతుండవు సర్వ శక్తుఁడవు రాజా రామచంద్రప్రభో॥

(నిష్క్రమించును)

కనకాంగి:— (మందహాసముతో) మనోహరా! మీ జననివచనంబులుదలకెక్కినట్లు తోఁచుచున్నది!

తులసి:— (నవ్వుచు) ఆమెమాటల కేమిగాని (వినుట నభినయించి) అదేమి మాటల సవ్వడి వినవచ్చుచున్నది.

(ఇద్దఱు వినుట నభినయింతురు)

(తెరలో)

అయ్యా! మా తులసీదా సెచ్చట నున్నాఁడు ఆ! మీ తెలుఁగరా! ఏమి? ఏమనుచున్నారు? వారకాంతా సక్తుఁడై తిరుగుచున్నాఁడనియా? అయ్యో! నాతనయుఁడిప్పు డెచ్చట నున్నాఁడో చెప్పగలరా?

కన:— ఆ కంఠస్వరము మీ జనకులగు ఆత్మారాముని దే!

తుల:— ఆఁ అట్లనేయున్నది— అగును.

(మఱల తెరలో)

సరిసరి! తెలసినది! కనకాంగి మందిరమున నని యా! ఏదీ! ఆప్పగృహమెక్కడ? ఏమను చున్నారు? ఆఁ? ఏదీ! యిదియేననుచున్నారా?

కన:— అదిగో వారిటులనే వచ్చుచున్నారు.

( ప్రవేశము ఆత్మారాముఁడు )

ఆత్మా:— తులసీ! ఇంకను లేచిరావేల?

(తులసీదాసు భయవిహ్వలుఁడై ముందు నడువగా ఆత్మారాముఁడు వెనుక నిష్క్రమించును)

(కనకాంగి నిర్విణ్ణయై నిలచిపోవును. అవనిక పడును.)



## తృతీయరంగము.

స్థలము:— ఉద్యానవనము

( ప్రవేశము మోహనాంగి ).

మోహనాంగి:- ( స్వగతము ) ఔరా! ఏమి యీ యుద్యానవన రామణీయకము! వివిధతరులతా పుష్పశోభితంబగు నీయారామము నందనోద్యానమును మరపించుచున్నది! దీని రక్షణార్థమే కాఁబోలు రాజభటు లందందు జాగరూకతతో గాచియున్నారు. ఇట్టి మనోహరోద్యానమునకు స్త్రీజనము రాకుండ నిషేధించుటయందు నాత్మారాముఁడు మిగుల నన్యాయముగా బ్రవర్తించినాఁడని తలంచెదను. పాపము! అతఁడు మాత్ర మేమిచేయఁగలడు? నిరంతరవారనారీలోలుండగు తన తనూభవుని గాంతావిముఖుని చేయఁబూని యిట్లొంటరిగనుంచి వేదచోదితునిగా నొనర్చి నీతిఁ గఱపుచున్నాఁడు. ( పరిక్రమించి ) విధిచెర్యము లనూహ్యములు గదా! తులసీదాసును పరస్త్రీవర్జితునిగఁ జేయుతలఁపున నవయౌవనాంగినగు నన్నుసృజించి యిట్లు నియమించుటయం దాతనియభిప్రాయమేమైయుండు

నో గదా! నానాలతా పరివృతంబును వివిధ పరిమళ పుష్పపల్లవ శోభితంబును శుకపికరాజి తాభిరామంబును నగు నీ వనంబున నుషఃకాలంబున నీ పిల్లతెమ్మెరలు వీచు సమయంబున జవరాలనగు నన్నొంటిపాటున గన్గొనిన నెట్టి యువకునికైనను మోహము నుద్భవించునే గాని యుపశమించునా ? అందును జిరకాలమునుండియుఁ గాంతాజనములకు దూరముగాఁ జేయఁబడి సుందరీ వదనారవింద సందర్శనోత్సాహిగా నుండు నీ తులసీదాసు నన్నుఁ గాంచి డాల్మి వహింపఁగలఁడా? ఇది యెట్లు సంభవించఁగలదు? అకటా! నే నెంత వెఱ్ఱిదానను. ఘటనాఘటన సామర్థ్యంబుగల పరాత్పరుని కృత్యంబుల విమర్శింప నే నెంతదానను. నా కొసంగఁబడిన యాజ్ఞను నిర్వర్తింపఁ బ్రయత్నించెద. అదుగో! తులసీదాసు తన యనుంగుసఖులతో నిదే వచ్చుచున్నాఁడు. నేనీ మాధవీ లతలమాటున డాగి యుండెద.

( అని అట్లు చేయును. )

( ప్రవేశము—తులసీదాసు—వికారదుఁడు—ప్రశాంతుఁడు ).

తుల:— దాని ప్రభావము వర్ణనాతీతము.

ఉ॥ వేదము గాచెఁ బ్రస్థుత వివేకము దెల్పెడు దివ్యశక్తి యా
వేద మెదేవతా తతికి బెన్నిధి భూమి సుపర్వకోటికిఁ

వేదమెజ్ఞానకాంతియు పవిత్రతయుఁ లభియింపఁజేయునా
వేదమునుండి వెల్వడు వివేకవిశేషము చెల్పశక్యమే ॥

మన గురువులచే నొసంగఁబడు వేదము అవాఙ్మానస గోచరము. అది మధ్యాంతరహితమై దివ్య తేజంబున వెల్గొందుచుండు. అట్టి తేజోదర్శనము నిరంతరము జేయుచున్నను దనివి తీరదు సుమీ!

ప్రశాం:— ఆహాహా! ఇంతలోనే తెల్లవారుచుండెనే. పక్షుల కలకలారావములు వినవచ్చుచున్నవి. రేలతాంగి నిశాకరుని వెలవెలబాటుఁ జూచి సహింపఁజాలక దృష్టిపథమునుండి మెల్లన జారుచున్నది. పాపనాశనంబై పుణ్య ముద్భవించుచున్నదో యన్నట్లు చీకట్లువోయి వెలుఁగెట్లుప్రకాశించుచున్నదో కనుఁగొనుము.

విశా:— మిత్రులారా! అయ్యవా రగ్నిహోత్రాద్యనుష్ఠానంబులఁ దీర్చుకొని వచ్చుకాలమైనది. మనమింకను స్నానమయినఁ జేయలేదు. వారు మనకై వేచియుందురు. త్వరపడుఁడు.

ప్రశాం:— (మోహనాంగినిఁజూచి) మిత్రమా! ఆ లేమావి గున్నకడ నదేమి?

విశా:— ఏదీ! ఏదీ! ఆ! కనుల మిరుమిట్లు గొలుపుచున్నదే! ఆ కాంతియేమైయుండును.

తుల:— అదియా!

చ॥ తొలకరిమించు దీవగతిఁదోఁచుఁ

దటిల్లత కిట్టి యొప్పొలుకన్

ప్రశాం:- కలుగునె! నిశ్చలంబుగఁ గనంబడునిద్దిపదారువన్నెలన్

జెలఁగు సువర్ణపుంబ్రతిమ

విశా:- చేతన మున్నటులుండి యుండియూ

ర్పులునిగుడించుచుం గదలఁబోయిదిపుత్తడిబొమ్మ కాదుతొ

య్యలి

తుల:- చిగురాకుబోఁడి కుటిలాలక చంద్రనిభాస్యతన్వియే!

ప్రశాం:— మిత్రమా!

గీ॥ ఈ యొయారంబు లీ హొయలీవిలాస

మచ్చరకు గాకగలవె? మర్త్యాంగనలకు.

విశా:- ఱెప్పపాల్పక యనిమేష వృత్తిఁదెలుపు

వేలుపు వెలంతగాఁదోఁచు నీ లతాంగి॥

తుల:-

చం॥ వరసుతచూడనీమె యిటవారవిలాసినియేమొ రంభయో?

ఉరగియొ హేమరోచయరయనూర్వశియేమొ ఘృతాచియేమొయా

పరువపు బుంజకస్థలియొ బ్రాయపుసోయగముల్ మనోజ్ఞమై

పతిఁగొను నాదు డెందమిఁక పైదలినాకటుదక్కునో గదా॥

కాంతకంటఁ బడుటయే తడవుగా మదనవికారములు పొడసూపుచున్నవి. అన్నా! ఏమి సౌందర్యము! అపేక్షించిన నిట్టి కాంతనే యపేక్షింపవలయు.

ఉ॥ ఆడిన వన్నెలాఁడి కడ నర్మిలి ముచ్చటలాడఁగా దగున్
పాడిన నన్ను మిన్నవల పారెడి పాటలె పాడఁగాదగున్
వేఁడిన చంచలాక్షి కను వేఁదుఱుదీర్పఁగ వేడఁగాదగున్
గూడిన నీలతాంగి రతిగూర్పుమటంచును గూడఁగాదగున్ ॥

పంచబాణుండు నా పంచప్రాణంబులుఁ బారి గొనుచున్నాఁడు. కటా! ఇప్పు డేమి సేయుదును? నే నేపోయి యాభామిని బల్కరించిచూచెద!

(పోవుచుందును).

విశా:- మిత్రమా! ఇది యేమిభ్రాంతి! మరల నా ప్రశంస యేమొదలిడితివి? ఆఁగుమాఁగుము! నీ వట్లు పోవలదు.

తులసి:- నన్నడ్డకుము. పోక తప్పదు.

(పరిక్రమించును.)

విశా<br>ప్రశాం } మిత్రమా! పోవలదు! పోవలదు.

విశా:- ప్రశాంతా! ఇఁక మన మూరకొనిన ప్రయోజనములేదు. వెంటనే మన గురూత్తమునకు సర్వమును నివేదించి యిచ్చోటికి పిలుచుకొని వచ్చుటయే శ్రేయస్కరము. రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు.)

(తులసీదాసు పరిక్రమించి మోహావేశాంగితో)

ఉ॥ ఎవ్వరిదానవే కలికి! యెందులకే కలహంసి వోలెని
ట్లివ్వన భూమినొంటి జరి యించెదు?

మోహ:— భూసురవర్య వేలుపుం

గ్రొవ్విరిబోణి నీతరునికుంజముల న్విహరించు వేడ్కనే
నివ్విధి సాహసించి గ్రమియించితినన్ను క్షమింపవే కడున్॥

తుల:— క్షమించుటకు నీచేసిన తప్పేమున్నది? కాని కాంతా! నిన్నుగని నప్పటినుండియు నీపై భ్రాంతిఁజెంది యున్నాను. కారణ మేమంటివేని.

ఉ॥ కాంతులమించుమోము కనకద్యుతి మించిన మేని చాయ వి
  భ్రాంతము వక్షమెంతో సరసత్వము జూపెడు కల్కిచూపులో
  కాంతరో! నిన్ను నాదు బిగికౌఁగిటఁ జేర్చి సుఖింపకున్న నా
  భ్రాంతికి మేరగల్గునొకో? ప్రాణము నిల్పునె మేన చిత్తరీ॥

మోహనాంగీ! నాకోరికలీడేర్చినన్ను రక్షింపుము.

మోహనాంగి:— (స్వగతము) ఇతడు నా పేరెట్లుగన్గొనెను? తపోమహిమవలనఁ గాదుగదా! కాదు! కాదు! నా రూపలావణ్యాధిక్యత వలననట్లు సంబోధించి యుండును. వీనికినన్ను జూచిన కాలంది మోహముగ్గల మగు చున్నట్లున్నది. నేననుకొనినట్లు భగవదాజ్ఞ ప్రతికూలమే యగుచున్నట్లు గన్పించుచున్నది. కానిమ్ము నాశక్తివంచనలేక వీనివిరహమునకు విరక్తిఁ జూపెదఁగాక!

తులసి:— జగన్మోహినీ యేమి యూరకైతివి! మరుబారికి తాళజాల! నిన్ను శరణంటి రక్షింపుము!

మోహ:— ఊరకుండక నే నేమందును. అమాత్యవర్యా!

గీ॥ నిఖిల నిగమాంత వేద్యుండు నిష్కళంక
జ్ఞాన సంపత్కరుండు విజ్ఞానయుతుఁడు
పూతచారిత్రుఁడసమాన పుణ్యతముఁడ
టంచువిందు వాత్మారాముఁడనఘచరితు॥

అట్టివానికి తనయుండవై పరకాంత నొంటిగఁ గని మోహనాంగీ! జగన్మోహినీ! యని పైఁబడు నీతో నేనేమి సంభాషింపఁగలను. ఇచటనుండు మృగంబులు సైతము నవి నీతివిసర్జితలై యుండ సత్సాంగత్యము సర్వ శ్రేయములకు మూలమని విని యిచ్చటికి వచ్చినందులకు నీవు నాతో నిట్టి మాటలాడఁ జూచితివా! చాలు! చాలు! ఏమి యింకను దగ్గరకు వచ్చుచున్నావు. పొమ్ము దూరముగా తొలఁగుము.

తులసి:— అలివేణీ! భయ విహ్వలవై యేల నన్నిట్లు వెలిపించెదు. ఈ యారామంబు నాయదియు. నీకేమియు భయములేదు. ఇంక బరులెవ్వరును లేరు. మన యిచ్చవచ్చినట్లు విచ్చలవిడిముచ్చటలాడ వచ్చును. (దగ్గరకు బోయి)

వృత్తము.

కలికి చిలుకల కొలికిమదనునికాఁకలోర్వఁగఁ జాలనే
తలపు మదనుని తవాల నొలుగుదు ధన్యుఁజేయవె కోమలీ
కళలుగలవని కలఁతపడుచును కాంత ఏదరిఁ జేరితి—
వలపు నిలుపుము వగల జొనుపుము వాంఛితంబులుదీర్పవే. ॥

(పైఁబడ బోవును మోహనాంగి తప్పించుకొని)

మోహనాంగి:—

వృ త్త ము.

కుటిల హృదయుఁడ గుఱుతు తెలియక కూడవచ్చెద వేలరా?
కటుకువను మరు కరుణిగవిసినదగ్ధమాదువు బ్రోవుమ్మణా?
విటుల విరహము విరము దలఁపకు వేల్పు కాంతనుజాతు సం
కటముగ నిరొందు కటకటను బడి కానికృత్యమిదేలరా?॥

అయ్యో! యింత యోజింపవేమి?

మ॥ అకలంకంబు కులంబు ధర్మపరు డాత్మారాముఁ డుగ్రతండ్రి సి
కకటా! కట్టడిపై చరింపఁ దగవయ్యా! నీతి బోధించు ధా
ర్మికులిం కెవ్వరు లేర?

తులసి:— మాన శరుబారిఁ జిక్కి నేతాళనే
సకియా! నిబిగి కౌఁగిలిచ్చి మధురోష్ఠంబిచ్చి రక్షింపవే!

(మోహనాంగి పొదరింట దాగును.)

(స్వగతము.)

గీ॥ లేమ జింకలరీతి నీలేమమిగుల
బెదరి బెదరింపఁ జొచ్చెను భీతిచేత
పూవుటీరంబుఁ జొచ్చి యీ పోటి తవదు
జాణతనమును వెలిఁబుచ్చె చతురమతిని.॥

నేను-మదన తాపమును బట్టఁజాలక బహిరంగ ప్రదేశమున పైఁబడ నుద్యమించుటచే నాఁడుది యగుటం జేసి భీతిపడి నన్ను బెదరించినగాని తాళనని చతురత నాపొదరింట నిలచినది. ఔరా? దీనిభావ గర్భితము మోహము దీర్చుకొనుటకు తగిన యిరవిదిగాని యది కాదని చూపుటకా? ఆహా?

గీ॥ మోహనాంగికి మోహంబు ముదిరి ముదిరి
చెదరి యీరీతిగా నన్ను చెదరగొట్ట
బూచు చున్నదిగా నోపు (పరికాశముగా)
సుదతి ప్రణయ
కలహమునకును సిద్ధమై కపయనుంటి.॥

( గుప్పున పొదరింట మోహనాంగికడకు దూకును. దేవకన్నియ అదృశ్యమగును. )

తుల:—(విభ్రాంతితో)

కం॥ ఏదీ నా తొలకరి మెరు
పేదీ నాదివ్యసుదతి యెటుబోయెనొకో
ఏదీ నా వలపులగని
ఏదీ నా మోహనాంగి యేదీ! యేదీ!

(దిశలు పరికించి చూచి) నా మోహనాంగి యెచటికి బోయెను? ఎచటను గానరాదే? నామది నరయ నెచటనైన డాగియుండెనా!

సీ॥ లేమావిగున్న! యీ లేజిగుళ్ళనుమించు
తలిరాకుబోడి యే దారిజనియె?
పొదరిల్ల! యిటపొంచి పొరలాడు పుత్తడి
పొన్నారియేజాడఁ బోయెదూరి?
శ్రీవ్రిరి! నిను ద్రుంచి కూర్మిని గనిపట్టి
కేళిని యెటుబోయె గిన్క బూని?
శుకరాజ! మిముమించి శోభతో బాడెడు
శుకవాణి యేవంక సోలెనొక్క?

తే॥ కలసి కలయిక గనలేని కాంత సౌఖ్య
మబ్బునో లేదొ? ఆ! యేమి అబ్బకున్న
కాంత విడుతునె యేకాంతు కాంతయైన
కాంచితమిదీర కౌఁగిట గారవింతు॥

హా! మోహనాంగి !

గీ॥ మెఱుపువోలె తళుక్కని మెఱసి నాదు
యుల్లము హరించిపోయె విద్యుల్లతాంగి
విషము సాయకుఁడుగ్ర దుంట వింటివాఁడు
బ్రతుకనిచ్చునె యీ మారహతకుఁడింక.

కామశరధారల కింక నే నోర్వఁజాల. నాశరీరంబు నీయధీనంబు జేసితి. కాము బారినుండి తప్పించి నీకౌఁగిలిచ్చి రక్షించెదవో! లేక మదన శరదావాగ్ని కింధనంబుజేసి శిక్షించెదవో! నీదే భారము. మోహనాంగీ! మోమోట మేలపడియెదవు. ముద్దాడరాదఁటే సిగ్గుమాలిన సిగ్గు నిన్ను దగ్గరకు రానీయకున్నదని చెప్పరాదా? నేనే వచ్చియుందునుగా! ఏలయిట్టి రిత్త కోరికలు. నామోహనాంగినను నిజంబుగ నెడబాసినది. ఎడబాసినదా ? నిజమేనా ? నిజమైనచో నామేన ప్రాణంబులు నిలుచునా? హా! మోహనాంగీ!

(మూర్ఛిల్లును.)

(ప్రవేశము. ఆత్మారాముఁడు. ప్రశాంతుఁడు. విశారదుఁడు)

ప్రశాం:— సీ॥ అల్లిబిల్లిగ నల్లు మల్లెపూ బొదరింట
　　　　　　　　తులసి దాసుండెట్లు దుమికినాఁడు.

విశా:—　　జిలిబిలిమాటల చిన్నారి యాటల
　　　　　　　　పాటలాధరి యెట్లు పాఱిపోయె.

ప్రశాం:—　　విరహ వేదన చేత వేసారివేసారి
　　　　　　　　వెలఁది మాయలచేత వెగడు బడియె

విశా:—　　వెఱ్ఱి మొఱ్ఱిగ దాను వేవిధంబులఁ బల్కు
　　　　　　　　బల్కు బల్కున బల్కు బడరి యనుచు

ఆత్మా:— తే॥ అహహ! కష్టంబు గల్గెగా యాత్మజునకు
　　　　　　వలపుకన్నుల కగపడు వంతలోనె
　　　　　　రాజభటు లిట్టులుండ నారామమునకు
　　　　　　రామ యేరీతి వచ్చెనో రామ మహిమ ॥

విశా:— ఆమెఅనిమేమ స్థితిచే దేవకన్నియ యనితలంచి
　　　　తిమి.

ఆత్మా:— ఆహా! నాకొమరుని గుణంబుబరిశీలింప దేవతలే
　　　　దలంచిన నేనేమిచేయఁగలను. నాకుల దైవతము
　　　　నాఆత్మారాముఁడు నాకు తోడు నీడయైరాఁడే!
　　　　నన్ను కాపాడఁడే! ఏఁడీ! వాఁడేఁడీ!

విశా:— దేవా, అడుగో! ఆపొదరింటఁ బడియున్న
　　　　వాఁడు.

(అందరు పరిక్రమించి)

ఆత్మ:—ఆసోదరింటఁ దూఱుటకెచటను దారిగాన్పిం చదే! ఇతఁడేవిధమున నీసోదరింటఁజొచ్చె! ఔరా! కాముకులెట్టి కడింది కార్యంబైన జేయుటకు సాహసింతురు గదా? పుత్రకా! తులసీ! ఇటు రమ్ము.

(తులసీదాసు లేచి)

తుల:— సమాన వృత్తము

రారమారనిన్ను గనఁ • పారభామయింతటసే
కోరవేర రక్షణ మా • ధారమంచు నెంచికనఁ॥

నీపైకయ్యమ్మునకు గాల్దువ్వుచు వచ్చినమోహ నాంగినికనుమరగించి నాపైదండెత్త వచ్చితివా? రమ్ము రమ్ము. నిన్నిప్పుడే వమ్ముజేసెద.

(అని భీకరాకారము జూపుచు గంతులు వేయును)

ఆత్మ:— ఆహాహా! ఆమోహనాంగి నాతనయునిపై వెఱ్ఱివిత్తనమునాటిదాటినది. ఇకఁ తెరువెయ్యది? శిష్యులారా? మీరీసోదరిల్లు ఛేదించి తులసీ దాసు నిటుతీసికొని రండు

(వారు తులసీదాసుకడకుఁబోవ నున్మాదముతో తులసీదాసు ప్రశాంతుని బట్టుకొని)

తులసి:— ఉన్మాద వృత్తము

మదనాంగీ। మదిరాక్షీ। మదినిన్నుఁ। దుదిపీడఁ॥
(అని కౌఁగిలింప బోవును)
సురనారీ। తటిగాదే। వెఱపేలా। దరిజేరఁ॥

—

(అని విశారదుని బట్టుకొనఁబోవును. విశారదుఁడును ప్రశాంతుఁడును చెరియొక చెయ్యిను బట్టుకొని యాత్మారాముని కడకు దీసికొని వత్తురు.)

ఆత్మారాము:-- తులసీ! ఏలయిట్లు పిచ్చివాఁడ వైతివి!

తులసి:--　　　సుకాంతి వృత్తము.

నినుఁగనక। గనఁదగుఁ। మనంబునఁ ఘనాజిలోఁ

(అనితండ్రిని బట్టబోవ శిష్యులు నివారింతురు)

ఆత్మా:- తులసీ! నీకేమి కావలయును?

తులసి:- మోహనాంగి. మోహనాంగి.

ఆత్మా:- నేనుజెప్పిన మాటలను విందువేని యొకనిము సములోననే మోహనాంగిని రప్పించెదను.

తులసి:-- నీమాటలను వినుటయేగాదు. మోహనాంగినిగన్పరచెదవన్న నేమిజేయుమనినజేయుదును.

ఆత్మా:-- ఇదినిశ్చయమేనా?

తుల-- త్రికరణశుద్ధిగా. సావధాన చిత్తుండనైయుండెద.

ఆత్మా:-- తులసీ! మోహాంధకారమును మనశ్శక్తిచే ఛేదించలేనప్పుడు మన్మధపిశాచ మావేశించి మనంబు మోహనాంగుల మీఁదికి బారును. ఎవ్వఁడు దుస్స్వభావ దుర్వ్యసన దుశ్శీల దుష్ప్రవర్తకులగు తోయజాక్షుల స్నేహితులుగఁ జేకొనివచ్చు మన్మధుని ధిక్కరించునో వాఁడే ధీరుఁడు. నీహృదయమునింతగా నాకర్షించుచున్న

యీ మోహనాంగుల తనూ కాంతులును
తళ్కు బెళ్కులును క్షణ భంగురములు సుమా!

చం॥ మిణుగురు పుర్వుచందమున మేల్మి ప్రకాశము లిప్త కాలమే
వినగను గానముం బలెను వీనులవిందు నిమేష మాత్రమే
ఘనకుసుమంబు తావివలెఁ గ్రోలుసు వాసన ఝామె కాలమే
తనులత సౌరరమ్యగుణ తావుల నిత్యము సత్యమిద్ధరన్॥

స్త్రీలయందాసక్తివహించుటయేయొక కానిపని. అందును పరకీయాసక్తుఁడు.

ఉ॥ త్రాగిన వాని చందమున దల్లడిలున్ మతిలేక తాను స్వ
ప్నాగతదివ్యకాంతఁగొను వానివలెన్ గ్రహియించు జాదముల్
వీగినవాని పోలికను తెంగనొనున్ గదుద్రవ్యవంతుఁడా
భోగియె జోగియౌనవిన బూటకులేని బికారి యౌనుగన్॥

తులసి:— ధనికుండైనను నిర్ధనుండైనను కామదేవునకు
నొక్కటియేగదా! కామదేవా! నీకు నమ
స్కారము.

ఆత్మా:— తనయా? నీవుచెప్పినది సత్యము. ఏలయన

సీ॥ మన్మథుండే పరబ్రహ్మంబుగా నెంచు
వనిత సుపాస్యదేవతగ నెంచు
తరుణివాక్యంబె వేదంబంచు మదినెంచు
శృంగారమే శ్రుతి స్మృతిఁగ నెంచు
వెలయుఁగోర్కెలె వేదాంతమనియెంచు
మదిదోఁచినదె ధర్మమనిదలంచు

అలరుబ్రిహ్మానందమని యెంచు విషయేచ్ఛ
స్త్రీభోగమే రాచత్రోగ నెంచు.

తే॥ నటవిదూషక గాయక విటులుపండి
తోత్తములటంచు మది నెంచి యూహఁ బెంచు
యౌవనోన్మాద పర్త్యజ్ఞానమూర్తి
సహజదుర్గుణ మదనార్తి చక్రవర్తి ॥

తులసి:- జనకా? నామాట చెప్పవేమి? మోహనరూపంబు
దాల్చిన నామోహనాంగి యెచ్చట?

ఆత్మా:-

మ॥ మరుభూమింగని యెండమావులనునమ్మారోపవాసుల్ ఘనుల్
విరివిన్ డెందపు వేడియాస మిగులన్ విచ్చల్ విడిన్ బారుగా
మురువన్నిందిరి పుత్రసంతతిసహోమున్గన్ గదాకోరికన్
దరమామారుని మార్గ్గనంగఁదులసీ! దార్మారు దామారిదన్ ॥

తుల:—తండ్రీ! మూరు మార్గ్గనుటకు మునులకు కూడ దరముగాదా! నేననుగునదేమి? మీరు చెప్పునదేమి?

ఆత్మా:- కుమారా! సుప్రవర్తనగల శ్రేయజాతుల దుస్స్వభావమును దెలసి వారివృద్ధికై శ్రద్ధగల మన్మధుని ధిక్కరించెడివాఁడేధీవరుఁడు. తక్కుంగలవారలు దీనులు. నీవుధీవరుఁడవా? దీనుఁడవా? తెల్పుము.

తులసి:—

ఉ॥ దీనుఁడ దేవకన్నియను దేవుఁజాడఁగఁ గోరువాఁడ నా
మానస మెల్లనయ్యమరమానినిదోఁచె నిఁబోయెనయ్యయో
చావనుజాడకుండవిముసంబును దాళఁగఁజాల ప్రాణమే
లా నవయౌవనాంగి పరిరంభణసౌఖ్యము లేకయుండినన్॥

జనకా! నాహృదయ మాయవిబుధకాంత హరించి పోయినది. ఇప్పుడుమీరు చెప్పెడినీతులు నాతల కెక్కవు! మీరునన్ను కాపాడఁదలఁచిన యెడ నాకయ్యమరకాంతను జూపి రక్షింపవేఁడెద. (నమస్కరించును)

ఆత్మ:— అకటా నే నిప్పుడేమి సేయుదును? ఓ శ్రీరామ చంద్రా!

ఉ॥ ఓడఁడు పాపకృత్యమని నోరిమినుగ్మలి మీఁదిమోహమున్
వీడఁడు ధర్మశాస్త్రసువివేకము గల్గిన తోడిమిత్రులన్.
గూడఁడు ఘోరపాతకుఁడు గూళనువన్ క్షమియింపు మంచునిన్
వేడఁడు నాతనూభవుఁడు నీనికృపన్ గరుణించి ప్రోవవే!

అంతయు శ్రీరామచంద్రునిదే భారము. ఇట్టి డోలాయమానమానసుండగు తులసీదాసును తరింపజేయుటకు నాదిమధ్యాంత రహితుండును ననంతకళ్యాణ గుణావహుండును నాత్మారామపాలకుండును నగు శ్రీరామ చంద్రునకుదక్క నితరులకు శక్యంబుగాదు. కావున నాదిదేవుండగు నా శ్రీమన్నారాయణుని పాదపద్మములనే స్మరించెదగాక.

ఉ॥ ఓ కరుణాసముద్ర!గన — వోజవరక్షణ దివ్యముద్రని
శ్రీకర దివ్యలీలలను—జిత్తమునన్ దలపోయ శక్యమే

ప్రాకటమైన వంశమున - బ్రాపుగఁబుట్టి మదీయపుత్రుఁడున్
వీఁకవిరోధికృత్యముల - వేడుకజేయుచు నుండె రాఘవా॥

( ధ్యానము నటించి )

గీ॥ దైవఘటనజేసి దేవకన్నియవీవు
వచ్చియుంటివమ్మ వసుధకిపుడు
తులసిదాసు దృష్టితులతూఁగ నిమీఁద
రమణిమఱొకసారి రాఁగదమ్మ!

(అని కృతాంజలియై నిమీలిత లోచనుండై యుండ దేవకన్నియ వచ్చును.)

తులసి:-- (చూచి)

ఉ॥ అన్నులమిన్న కన్నులకు నన్నువుజేసెకి మోహనాంగిసా
విన్నపమాలకించి పలవించెకు దీనుని జంటజేర్పవే
కన్నిన రాఁగదేసఖుని గౌఁగిటఁ జేర్పఁగదేమిటారియా
క్రొన్నవవిల్లువాలమున గూడినను సుఖియింపఁ జేయవే॥

( మోహనాంగిని పట్టఁబోవ సహాధ్యాయులు వారింతురు ).

ప్రశాం:- ఆర్యోత్తమా! ఈమోహనాంగియే మన తులసీదాసును మోహసముద్రమునముంచిన మాయలాఁడి.

విశా:--గురూత్తమా! ఇదివఱకు జేసినదిచాలక మరల తులసీదాసుని విషాదమగ్నునిఁ జేయవచ్చినది.

ఆత్మా:- దయామయుండగు నాత్మారాముని యనుగ్రహముండిన నేమియు భయములేదు. వానినే

నమ్మి చరింపవలయు (ఆత్మగతము) శ్రీరా
ముని మహిమచే నీ మోహనాంగిని వికృతాకారి
గా నొనర్చెదగాక !

(యోగము నటించును. మోహనాంగి వికృతరూపమున ప్రవేశించును.)

మోహ:— ఔరా! ఈ యాత్మారాముని జాల విద్య
నన్నెంత జేసినది. జగన్మోహనరూపినగు నన్ను
క్షణములో వికృతాకారినిగఁ జేసివైచెనే! దేవ
కన్నియనగు నన్నే యిటులఁ జేసిన నీ యాత్మా
రాముని విద్య నెన్నదరమే?

తులసి— (విభ్రాంతితో) ఏమి? మోహనాంగి విరూపి
యయ్యెనే! రేవెలుంగును ధిక్కరించు దేహ
కాంతి కాటుకరూపంబయ్యెనే! మోహంపు
టన్ను మెండినవరడయ్యెనే! ఇట్టి రక్తశల్య
చర్మ పూరితంబగు దాని నపేక్షించి యెట్టి
కాలంబు వృధబుచ్చి నాజనకు నెంతనొప్పించితి!
ఎట్టి నిర్మలయశంబును నలుపుజేసితి! ఛీ! ఛీ!
నేనిట్టి నిశ్చలతత్వజ్ఞాని యానందమును భిన్న
పరచి మాతండ్రి మొగంబెట్లుజూతు. ఇట్టి జన్మ
నెత్తుటకంటె యోగంబున జీవంబులు వదలుట
మంచిది.

(పోఁబోవఁ దండ్రి పట్టుకొనును)

మోహ:— తులసీదాసా! ఇట్టిదే కదా మోహము. ఇట్టి మోహాంబునకు నీవెట్టి యకృత్యంబులఁ జేయబూనితివో చూచితివా? ఇట్టి మోహంబునకై పరువు మర్యాదలకు భక్తి వైరాగ్యములకు, సిరిసంపదలకు, దూరుండవై తల్లిదండ్రులకుగూడ దూరుండవుగా నుంటివిగదా! ఆహా! మీపితరుని మహాత్మ్యంబున నాకీగతి కలిగినది! ఆయన పాదారవిందములపైఁబడి మ్రొక్కిన నెట్టియాపదలైనఁ దుదముట్టును— శ్రీరామభక్త మందారా! నమస్కారము! నారూపము నా కొసంగి నేను వైకుంఠమునకుఁ బోవ నాజ్ఞయీఁగోరెదను.

ఆత్మా:— మోహనాంగీ! నీవు నాదృష్టిపథంబున దప్పినంతనే నీ నిజరూపము నీకు వచ్చును. నీకు శుభంబు గల్గుగాక! పొమ్ము!

(దేవకన్నియ నిష్క్రమించును)

(స్వగతము) కట్టా! ఎట్టి కట్టిడి కార్యంబునకు దులసీదాసు గడంగెను? లజ్జాకరంబులగు నాతని యకృత్యంబులే యింతటి సాహసంబునకు బురికొల్పినవి. లోకంబునఁ గాముకుల కెల్లరకు గతు లిట్టివేగదా! మును ముందు కన్నుమిన్నెఱుంగక లోకంబును విసర్జించి కాముకులు కామినీ లోలురై పిదప బంధుమిత్రులఁ

జూడనైన లజ్జించి ప్రాణత్యాగంబునకై సంసిద్ధులయ్యెదరు. ఇట్టిదేగదా దుష్టకార్యఫలము. కానియిట్టి పశ్చాత్తాపంబుగల వానిని జేరఁదీసి బుజ్జగింపవలయు (ప్రకాశముగా) తనయా! ఏల యీతొందరపాటు ?

తులసి :— (తండ్రి పాదములపైఁబడి) జనకా ! ఇట్టి క్రూరకర్మంబుల గావించిన నావంటి పాపి ప్రాణంబులఁ గాపాడఁదలంచెద రేల? నావంటి వాఁడుండిననేమి ? మండిననేమి? నా యీయపరాధమును క్షమింపుఁడు.

ఆత్మా:— నాయనా! ఈలోకమున నెవ్వరిచే నెప్పుడు నెట్టికార్యంబు జరిగినను శ్రీరామచంద్రుని యాజ్ఞలేనిదే జరుగఁబోదు. కాన నెట్టికార్యము నేను చేసితిననియెదవు? క్షమియింపుమనెదవు? చేయుటకు నీవెవ్వఁడవు? క్షమించుటకు నేనెవ్వఁడను? అన్నిటికిని శ్రీరామచంద్రుఁడే కారణభూతుఁడని యెంచుము తనయా? ఇక నిట్టి నీచకృత్యంబుల కొడఁబడకుము.

ఉత్సా. తనయ నీదుభార్యఁ దప్ప తక్కుసతుల నెల్లరన్
జనని భంగిదలచి పూజసలుపవలయు నిచ్చలున్
మనమునందు రాముసేవ మరువబోకు మాతఁడే
ఘనుడు నిన్ను గాచుసతము కదలఁద్రోచి పాపముల్ ॥

చం॥ చెనఁటులఁజేరబోకు మది చేడెల చెంతకుఁ బోవకుండఁగన్
ఘనతరప్రజ్ఞ బూనుమిటు కాంతను భార్యను వీడబోకుమా
జనులను నాత్మసోదరుల చాడ్పునఁ జూచుచు నెల్లకాలమున్
వినయము భక్తిశ్రద్ధయు వివేకముగల్గి బుధాళిగొల్వుమా॥

తులసి:— జనకా! మీపాదములాన ? మీరుజెప్పిన చొప్పున జేయువాఁడ.

గీ॥ తండ్రి మీపాదమాన నేతరుణినైన
దల్లివలె భావమందున దలఁచువాఁడ
గోర పరకాంతఁ గలనైన గోరకుంత
జనక నన్నేలుకొనుమయ్య జడతఁబదలె ॥

ఇది నాత్రికరణశుద్ధిగాఁ జేసిన ప్రమాణము.

ఆత్మా:— అయిన గృహంబున కేగుదమురమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)





# గోస్వామి తులసీదాస నాటకము.

## తృతీయాంకము.

### —• ప్రథమరంగము. •—

తులసి:— ఈ వియోగ సాగరంబును దాటు టెట్లు!
ఈ విరహము భరించు టెట్లు!

ఉ॥ హా! గతమేమి। రాదడయ। నంబుజలోచన నత్తయాజ్ఞకై।
నేగను వేచియుండునో కో! యింతిభయంపడినట్టె యుండెనో
నాగుటయెట్లు। నాసతిని నాత్రతఁజూడక నిట్టివేళలన్।
వీగుటయెట్లు! యీవిరహ వేదన, నాసతిరాక యుండినన్॥

చ॥ నిముసము తాళఁజాల, సతినేస్తము నింతని చెప్పఁజాల నా।
కమలదళాక్షినిన్ విడచికాలము బుచ్చుట కష్టమయ్యెడిన్!
సమమితగాత్రి, ప్రాణసఖి, సారసనేత్రి, విభాసురాంగినిన్
నిముసమువీడియుండుటది నిల్గుట గాక సజీవమెట్లగున్॥

ఇంతకాలము నాముద్దుల గుమ్మ రా దడసె
నేల! కారణమేమై యుండును?

చం॥ చనువుగ నత్తఁజేరి తనస్వామినిగూర్చటు బల్కుచుండెనో
పెనిమిటి దోషికాఁడనుచు భీతిని నత్తకు నచ్చబల్కెనో
తనమది దాచ కింతయును దప్పక జెప్పఁగ నత్తయల్గెనో
కనలుచుఁ బోవవల్దనఁగ గాఢ విషాద నిమగ్న యయ్యెనో॥

చం॥ తమిమది హెచ్చుచుండె మదిదాపనశక్యములైన యూహలున్
దమకము బెంచుచుండె గడుదైన్యములోపలఁజొచ్చిధైర్యమున్
క్రమముగ స్రుక్కెనె నను గాల్పఁగ మారుఁడు తారుమారుగా
శ్రమమున ద్రోయుచుండె సతిచక్కి నిమేషము లేక యుంటచేన్॥

నా మనోహారిణి యేల రాదడసె! తడసిన నే
దాళుటెట్లు! తాళకున్న భవితవ్యమెద్ది! తోఁచకున్నదే?
అంగజ సంగరంబున నానందంబు జెందుటకై చెలియ
యింకను రాదడసెనే! నాముదిత నన్ను విడచి యొక్క
క్షణమైన నుండనొల్లదే! ఇంత తడవేల జేసె! మాతృ
శ్రీయాజ్ఞాను బద్ధయైయుండెనా! అట్లుఁగాకున్న యేల రా
కుండును! బంధింపబడి యుండునా! అట్లేల జరుగును?
పాదుషావర్తమానము జేసినను నాపత్నిని విడచిపోనైతి
నని నాయోపిదర్పంబును దండన జేసినది కాఁబోలు?
మాయమ్మ యట్లేల జేయును. తప్పునాకడ నుండఁ
దరుణి నేలదడింప వలయు! నాకడ మాత్రమేమి తప్పు
గలదు? నాజనకుని యాజ్ఞానువర్తినై నాతరుణినివదల

కుంటినిగాని మఱొండు కారణము లేదుగదా! నాజన
కుండు నైమిశారణ్యంబునకుఁ బోయినది మొదలు
పాదుషా మాసంబునకు వేయి నిష్కంబులఁ బంపుచుండఁ
బిలువనంపినను నేఁబోవకుండుట తప్పని యెంచెఁగాఁబోలు!
ఇదియే నిక్కువంబు. ఇందుల నాసతి యింతజాగు సేసి
యుండనోపు. క్షణములు గడచు కొలంది మమతపై
మమతముప్పిరి గొనుచున్నది. యేమి చేయుదును?
ఏది దారి?

మమ:— (ప్రవేశించి) ప్రాణప్రియా! నమస్కారము.

తుల:— నామనోహారిణియా! సతతము నాప్రియ
పంజరమై యుండువుగాక! మనఃకాంతా? నన్ను
మూరువారిఁ బడఁద్రోసి యింతతడవేల జేసితివి?

మమ:— నాథా! అత్తగారు నన్నుం జేరఁజీరి "మమతా!
నీతల్లిదండ్రులు నిన్నుజూడ గుతూహల పడు
చున్నారు. రేపకడనే పోయిరమ్మ"ని యాన
తిచ్చిరి.

ఉ॥ నేనరుదెంతునంచు జననీజనకుల్ కడుసంభ్రమంబునన్
బ్రాణములన్ని నాపయిని బాళిగొనన్ దలవాకిలిల్లుగా
బూనిచరింత్రు పోకుమికి పోలదు నాల్గు దినాల లోననే
నే నరుదెంతు గాన కరుణించి ననున్ సెలవిచ్చి పంపరే॥

తులసి:— హా! ప్రేయసీ! ఎట్టిబెట్టిదపు వార్తజెప్పితివే

మమ:— ఏలయిట్లమంగళంబు లాడెదరు? నేనునా
పుట్టినింటికి బోవుట దుర్వార్త యెట్లగును?

తులసీదాసు .. మమతాదేవి.



TULSIDAS IN LOVE WITH HIS WIFE.

చం॥ కుతుకముతోఁ దుటక్ గనియు గూర్మిని జెందియు జిట్టిచేష్టలన్
దతికుతుకంబు జెందియును నాటలబాటలమోదమందియున్
సతతము నాసుఖంబె దమసౌఖ్యముగా దలపోయు భ్రాతలన్
బితరుల జూచివచ్చుటది వేడుకగాక మఱేమి యానాఁతో॥

తులసి :—అచ్చట నీకు గలుగు సంతోష జనకము లిచ్చట లేవు గాబోలును.

మమ:— నాథా మీరట్లననేల? సర్వవిధంబుల నంతకంటె నిచ్చట వేయిమడుంగు లధికము.

తులసి:— అట్లయినచో బోవు టెందులకు?

మమ:— కన్నవారి యభిలాషఁ దీర్చుటకు.

తుల:— నాపై గల్గుమక్కువ కన్న తలిదండ్రులపై గల్గుప్రేమ యెక్కువ కాఁబోలు.

మమ:— హెచ్చు తగ్గులు నిర్ణయించుటకు దానికిని దీనికిని పోలికయే లేదు.

తుల:— లేకున్నఁబో నెంచనేల?

మమ:— సతీపతుల కన్యోన్యమెంత మోహ ముండినను నాఁడుపుట్టువు సహజముగా పుట్టినింటికి బోవనిటు లాసపడును.

తుల:— నన్నేమి చేయనెంచితివి!

మమ:— మనశరీరంబులు కారణాంతరములచే నెడమైనను మనంబులు మోహరజ్జువులచే బధింపంబడి యుండెఁగదా!

తుల:— అట్లయిన నన్నువిడనాడ నీకిష్టమే!

మమ:— ఎప్పటికిని కాదు.

తుల:— తల్లిదండ్రుల నొంటరిగఁ బోయియెట్లు చూడ నగును?

మమ:— మనస్సును తమవద్దనిలిపి శరీర మాత్రవిభవ మైయేగిన.

తుల:— నీముమకాలంబైన నిన్నెడఁ బాయఁ జాలని వానికిశరీరము నుగుగుతుర చెద వే? శరీరము లేకున్న న న్నశరీరవాణితో సౌఖ్యమనుభవింపుమనియా నీయభిప్రాయము.

మమ:— నాథా! నేముమ్మాటికి మీమూర్తివిడనాడి యుండు దానను గాను. కావలెనన్న వారే వచ్చిచూచి పోవుదురు. కానినాథా! అత్తగారి యాజ్ఞ యవిలంఘ నీయము గదా!

తుల:— నీతల్లిదండ్రు లెవ్వరినైన నిన్నుదోడ్కొని రమ్మని బంపిరా?

మమ:— లేదు. వర్తమానము వచ్చినదని యత్తగారే చెప్పినారు.

తుల:— అట్లనా ! సరిలే! తెలిసినది. పాదుసాముమ్మారు రమ్మన మని చెప్పి పంచినను బోకుండుటచే నమ్మగారిట్లు పన్నుగడఁ బన్నిరిగాని మఱొండు గాదు. నేనిన్ను వదలుటకిది తెరవు గానెంచి

యట్లుచేసినదిగానిమఱొండుగాదు. నేనునిన్నెడ
బాసియొక్క క్షణమైన మనజాల. నీవునాసమక్ష
మునసెప్పుడు లేకుండెదవో యప్పుడే నేనీ
లోకంబున లేననుకొనుము. ఇది నిక్కువము.
ఇది నీకిష్టమైనచో బోవచ్చును.

మమ:-నాథా! అట్లు జేయుటకు నేనెన్నడైన నియ్య
కొందునే? మీసౌఖ్యమే నా సౌఖ్యము. నేను
బుట్టినింటికి బోను. కాని యత్తగారి యాజ్ఞ
ననుసరింపకుండుటెట్లు?

తుల:- నీకు పతియే కావలయునన్న మాయమ్మగారి
తో నే విన్నవించుకొని తత్ప్రియత్నములు విర
మించుకొనుము.

మమ:- ఉ॥ సుందరసత్తగారి నతిమోదముగొల్పెడి నాజ్ఞ వెన్కనో
గొందును గానరాని పతి యీప్సిత మోహ ప్రవాహ ఘోషలున్
గుండెను డెందమేమిగతి గోయియు సుందరవెన్క నాయియున్
గందువరైయు తెలంగునొకో! కాంతకిదెంతయు సంకటంబెగా ॥

మ॥ పతియేదైవము స్త్రీకటంచనిరి విద్వాంసుల్ నిరూపించి నే
పతిభక్తిం దలకొంచు నిన్నికబహిః ప్రాణంబుగా జూచెదన్
సతికిన్ భర్తయె తల్లిదండ్రి గురుఁడున్ దైవంబు నా గావునన్
పతుకంచారయ నత్తచేడెదమిమున్ గొల్వంగ నేవేళలన్ ॥

నాథా! నేనిప్పుడేపోయి మీతల్లిగారిని నేనట
కేగకుండుటకు, మీజంటనుండుటకు, నొప్పించి

యిదియే వచ్చెద. కాలాతీతంబునకు గనలకుము.

తుల:— అత్త నొప్పించి యతిరయంబున రావలయు. లేకున్న ప్రాణంబులు నిలుచుట కల్ల.

(మమతాదేవి నిష్క్రమించును)

కం॥ కట్టా! ఎక్కడికట్టడి
దిట్టతనంబునను నాకు దీర్ఘప్రయాసల్
కట్టడిగ గాంచి సత్పతి
తుట్టతుదన్ దల్లిపన్ని దూరము జేయన్ ॥

ఈ పన్నుగడ మాయమ్మ పన్నినదిగాని మఱొండుగాదు. నేనా సతింగూడి యహర్నిశంబు లుండ నిశ్చయించి పాదుషా పిలువనంపినను బోనైతి నని యిట్లు జేసియుండును. నామనంబు నాపత్నికి పతివ్రతా తిలకంబునకుఁ దెలియపరచుటచే నామె తప్పక మాయమ్మ నొప్పించి వచ్చును. ఏమియిది! నాకాంతయింకను రాకయుండె. జామైనదే! ఇక్లేల జాలంబు జేయుచుండె. నా మనోవేదన కంతులేనట్లు వారిమాటలకుఁ గూడ నంతులేకుండెఁగాఁబోలు. నాసతిని బాసిన స్వల్పకాలమే యుగంబులుగఁ గన్పట్టుచున్నది.

(మమత ప్రవేశము)

ఉ॥ మానినిజే ప్రియాణమును?

మమ:— ......................... మానక యేగుదుజే

తుల ॥ ................................ తలోదరీ

తానుగనొప్పెనే జనని

మధు:- ............ దండము బెట్టుచు నానఁగొంటిఁగా

తుల:--మానితె తల్లిదండ్రులను మక్కువ జూచుట మానినీమణీ

మధు:-మానిని కట్టివేళలనుమాన్యుఁడు బూజ్యుఁడుభర్తయాటచే.

తుల:-- ఇట్టి నయగుణశాలినియైన భార్యగల్గిన భర్తదే భాగ్యము. ఇట్టిదేగదా పతివ్రతల నిజప్రేమానుబంధము! భర్తకై ప్రేగుతోఁబుట్టిన ప్రేమను సహితము ద్రెంపినదే! అహాహా! నాభాగ్యము. కులకాంతకు వెలకాంతకు నెంతయంతరము గలదు.

సీ॥ ధనముకై వెలకాంత ధవునిగా సెంచును
కులకాంత ధనమంత కూర్మిపతియె
శయ్యకై వేశ్య దా శ్రమజెందు మదిలోన
శయ్యయే పతికాను సతివమిన్న
ముద్దుకై వగలాడి మూతిబిగించును
ముద్దాడు పతికింపు ముద్దుగుమ్మ
నగలకై వగలాడి నగవు జూపించును
వరలుప్రేమను జూపు వనిత పతికి .

తే॥ చిన్నెవన్నెలుగల్గియు జింతగూర్ప
నాకు నందకబల్కును వలరువేశ్య
స్థిరస్వభావంబునఁగల్గఁ జిత్తమునను
క్రియలచేఁ జూపుప్రేమను కెరలుభార్య !

మరియు

సీ॥ నిజప్రేమజూపును నిజసతీ తిలకంబు
గూఢ ప్రేమనుజూపు కుటిలవేశ్య
ధనసంపదల బెంపకలపెట్టు సత్సతి
ధనసంపదలగూర్చుఁ గనకహారి
మానంబుఁగాపాడు మానినీరత్నంబు
మానంబుదీయును మానహీన
కష్టకాలంబునఁ గాపాడు నిల్లాలు
కష్టంబులనుగూర్చు గణికవేశ్య
తే॥ ఇట్టి సత్సతీమణులను నంటవదలి
అట్టి కూళల జంటను నట్టెయుండ
గట్టిగుడుపవె గష్టముల్ గరుణలేక
వింతలియ్యవి జరిగెడు నింతనిజము॥

నెచ్చెలీ! మమతా!

ఉ॥ చల్లనిబల్కుతుంపరలు జల్లగ జల్లుచు మోదమొందగా
నుల్లము తల్లడిల్లగను నూర్జమడెల్లను బల్లవింపగా
యుల్లసమాడు మాటలను నొప్పగ నా దరిఁజేరి మక్కువన్
మెల్లగ మోము మోమునను మిన్నువడంకగ ముద్దులిచ్చెదన్॥

(ముద్దుబెట్టును)

మానినీమణి మనస్ఫూర్తిగ నొసర్చిన దాని
కిచ్చిన ముద్దురుచి యెంతయింపుగ నుండెను!

మమ:— ప్రాణకాంతా? అమృతతుల్యంబగు నీ ముద్దుచే నామనంబు పొంగి పొరలుచున్నది. కాని

యేకాలంబున హఠాత్తుగా భిన్నమగునో యని భీతిజనించుచున్నది.

తుల:— అట్లేల జరుగును ప్రాణప్రియా!

మమ:— అత్తగారు నాకడ నానగైకొన్నదని జెప్పితిఁ గదా!

తుల:— అదేటియాన?

మమ:— ఇట్లని మాయత్తగారు చెప్పినారు.

మ॥ మమతా! నీపతి నేనుగోరినపుడే మారాడె కేతెంచెడున్
సమయంబందునరాక యున్నయపుడే చావానినున్ బంపిదన్
విమలపవిత్రజ్ఞత శైలు కొమ్మిశనినిన్ వేవేగఁ బో పొమ్మికన్
మమతా! భద్రము! మాటమర్వకుసుమా! మర్యాద గాపాడుమా!

ప్రాణప్రియా! అట్టిఘట్టిదంపుటానకుఁ గట్టుఁబడి వచ్చుటచే నామది చలించుచున్నది.

తుల:- ప్రియా! మనకా! యెడఁబాటా! ఇట్టిమాటలునా చెవిని సోకఁగూడదు. నెచ్చెలీ! ఏనందుకీకొంటిని. సమయము వచ్చినప్పుడు జూచుకొందములే "అప్పటిమాటలకు దుప్పటిచ్చితిఁ గాని యెప్పటికినిగప్పనిచ్చితినా" యనియునవచ్చును లే! ఇప్పుడేల మనకావిచారము?

మమ:- ప్రాణనాథా! మీామురిపెంబునకు మేరలేదుగదా! మీా ముఖారవిందము జూచినకొలంది మీా ప్రేమ భాషణములు వినినకొలంది మీా మమతా ప్రియ

చర్యలననుభవించినకొలంది మఱి మఱిం బురి కొల్పుచుండునేగాని నామనంబున విసుగు జనిం చుటలేదుగా! ఆహాహా! ఇట్టివనితలదే భాగ్యము. ఇట్టిపురుషోత్తములే కదా పిజదార భరితలగు భర్తలు.

తుల:- ప్రేమపుంజమా! నిన్నువీక్షించినకొలంది వికాసము విసుగు జనింపకున్నదే! నీముఖవికాసము వేర్వేరు రుచుల గ్రక్కుచుండుటచే మోదమలరారు చున్నది. అమృత పానంబొనర్చిన కొలంది నమృతంబట్టియమై మఱింత రుచింపుచున్నది. చూచుటచే యిచ్ఛజనించి వినుటచే బెంపెక్కి స్పర్శనంబున బొరలిపొంగి మురిపెంబు ముద్దుచే నమృత పానంబుఁజేసినగాని తనివితీరకున్నది. ఆహాహా! ఇట్టిదిగదా నిజహృదయ స్ఫూరితమద నానలంబు శమము నొందదెరవు. కాంతా! మదీయమదన విహ్వాల విస్ఫూరిత విశ్రాంత! ప్ర శాంత! మన మిరువురము నేకి మనస్కులమై యేకమై దనరారుచుండ విడదీయ బ్రహ్మకైన నలవియగునా! తగునా!

చ॥ సకలకళా విభూషితుఁడు శాస్త్రవిచారుఁడు తండ్రియాజ్ఞచే
వికచదృగబ్జయౌసతికి వేడుక సంతసమొందుచుండఁగా
వికటములేల, గూడగను వేప్పవగామక సంగరంబునన్
వికటములేకయుండు మము వేరును జేయఁగ నేరికైనమా!

(తెరలో)

ఉ॥ వచ్చుచునుండె నల్లదిగో వాజుల సైన్యము వార్థికైవడిన్
హెచ్చుగఁగొల్చుచుండఁ గను హేళనఁబాదుష సామజంబుపై
మెచ్చుగ నెక్కి వీథులను మేలుగఁజూచుచు మేళవింపుచున్
వచ్చెగజంబు దానునిలువారము చెంతను నిల్పెనిమ్ముగన్॥

(తులసిదాసు వినుటనభినయించి)

తుల:— ఆహా! పాదుషా భద్రగజము మనయింటికడనే నిలచెనని చెప్పుకొనుచున్నారే! నాకొఱకే వచ్చి యుండలేదుగదా! ఒకవేళనట్లేయయినను నిప్పుడు వాని జూచువారెవ్వరు?

మమ:— హృదయేశ్వరా! మీరిట్లుపేక్షచేయుట పాడిగాదు. మామగారుకూడ నింటలేరు. చక్రవర్తి యంతటివాఁడు తనకుదానై మన మందిరమునకు విచ్చేసినప్పుడు తగురీతి సత్కరింప కుండుట భావ్యముగాదు.

(మరల తెరలో)

గీ॥ తనయమాత్యుని తోడ మంత్రణముసేయ
వచ్చినాడదె యక్బరుపాదుషాహి
నిపుజేసిన బాస గణించివేగ
తనయుఁబంపఁగదే మమతా లతాంగి!

మమ:— వింటిరా! అత్తగారియాజ్ఞ! నామనవి విని వేగమే పోయి పాదుషాకెదురేగి యుచితసత్కారం

బుల నాతని గౌరవించిరంట. తడవు మసలిన
నత్తగారికోపాగ్నికి శలభములము కాగలము.

తుల:— పెద్దపులివలె నీయక్కను నా వెంటబడనేల?
మమతాసతీ! నీముఖచంద్రుని బాసినాహృదయో
త్పలమొక్కక్షణమైన నుండజాలదు. ఏదియెటు
లైనను నిప్పుడు నేనుపోజాలను.

మమ:— నాథా! మీరు రాజకార్యముల యందత్రిప్రమ
త్తులరై యున్నారనియత్తగారికిత్తమపై గోపము
గలదు. ఆమెయాజ్ఞ నిర్వర్తించినాయీముద్దు చె
ల్లింపుడు. అదుగో అత్తగారుకూడ రోషారుణ
లోచనులై యిందేవచ్చుచున్నారు.

(ప్రవేశము రామాబాయి మమతకు దూరముగా నిలుచును)

రామా:— తులసీ!

చం॥ ఇరువదివత్సరంబులు పయింబడె నిప్పటికోతనూజ నీ
వెఱుఁగవుమంచిచెడ్డలు గ్రహింపవు కష్టసుఖంబులింతయున్
దిరముగ బాదుషాహి యురుదెం చెస్వయంబుగ బిల్వ గోళిమం
దిరమును వీడిరాజనదె నీకు గుమారక యిప్పుడేనియున్?

పాదుషా నీ కొఱకు వేచి యున్నాడు. సత్వరము
లేచిరమ్ము. ఏమి? మమతా! నాతోనిందాకనట్లు చెప్పియు
నీచేసినసత్యమ్మునకు విరుద్ధముగా బ్రవర్తించుట తగునా!

మమ:-నాథా! మీరుతత్క్షణమే పోయిచక్రవర్తిని గలసి
కొనకున్న నేనిప్పుడే ప్రాయోపవేశము జేసికొం
దును పిదపమీయిష్టము.

తులసీ:- ప్రాణేశ్వరీ! నీవిట్టి పట్టుబట్టిన నేనేమిచేయుదును?
తల్లీ! ఆగ్రహింపకుము. నేనిదే పోయివచ్చెద.

(నిష్క్రమించును.)

రామా:- (ప్రవేశించి)

మ॥ మమతా యేఁగదె పుట్టినింటకడ నీ మానంబుఁ గాపాడుకో
శ్రమయుంచున్ వెనుదీయఁబోకుమిఁక నశ్రద్ధాళివైయుండకే
తమమంచున్ దలపెట్టబోకుమిఁక నీ తల్లిన్ గనన్ బోఁగదే
తమి నా పుత్రుఁడు నేఁగుఁదెంచువరకున్ దావుల్ పరీక్షింపకే॥

మమతా! నీ వీక్షణంబున పుట్టినింటికరుగుము. కావ
లసిన పరికరంబులెల్ల నాయత్తంబుఁ జేసివచ్చితి.
నా పుత్రునితో నే జెప్పెదఁ బొమ్ము. మసలకుము.

మమ:-ఆజ్ఞానువర్తినినై యరిగెద. మీ తనయుని విష
యమై మీకుఁ జెప్పనదేమున్నది. మీ కోడ
లిదే నమస్కరించుచున్నది.

(రామాభాయి లేవదీయును. ఇరువురు నిష్క్రమింతురు.
(తిరిగి రామాభాయి ప్రవేశము.)

రామా:-అమ్మయ్యా! ఇప్పటికి నా యుద్దేశ్యము జిక్కఁ
బడినది. సందియము లేదు. తండ్రి తపంబుకేగిన
వర్షమునుండియు భార్య నొక్కక్షణమైన విడు
వక యుండిన నా తనయుని పాదుపాకొనిపోయె.

తటిమొఱఁగి కోడలిని దాని పుట్టినింటికిబంపితిని. నా తనయున కిప్పటికి లోకవ్యవహారంబులు జక్క జేయుటకు వెరవుదొరకినది. ఏది యెట్లు జేయుటకు శ్రీరామునిదే భారము.

(ధ్యానించును.)

(తులసీదాసు త్వరితముగవచ్చి.)

తుల:— అమ్మా! నా మమత యెచ్చట?

రామా:— తనయా! ఇట్లేల తత్తరంబునవచ్చితివి?

తుల:— తల్లీ! నీకుమ్రొక్కెదఁగాని మమత యెచ్చటనో జెప్పుము.

రామా:— పుత్రికా! నీ పుణ్యమాయెను. పాదుషా యనుమతితో వచ్చితివా! లేదా! చెప్పుము.

తుల:— అనుమతినేవచ్చితి. అనుగ్రహించి నీ కోడ లెచ్చటనున్నదో జెప్పుము.

రామా:- ఇచ్చట లేదు.

తుల:- ఎచ్చటికేగె!

రామా:- తల్లిదండ్రులఁజూడఁబుట్టినింటికేగె.

తుల:- (నిట్టూర్పువుచ్చి) నే ననుకొని నంతయుఁ జరిగినది. మించిన దేమున్నది! ఇదే నేనును బోయెదను.

రామా:- తనయా! ఇట్లు తత్తఱపడి పోనేటికి! జేప కడఁదప్పక నిచ్చటకువచ్చును. తర్లకుము. తాళుము, తపింపకుము.

తుల:— తే॥ తాళఁజాలను నిమిషంబు ధరణివదలి
నిలువఁజాలను బోయెదఁ గలువకంటిఁ
గాంచి ప్రేమించి తమిమించి కరుణనించి
ఈప్సితార్థంబుఁ జెందెద నింతిఁగూడి ॥

(పోబోవును తల్లి యడ్డగించును) హరి హరాదు లడ్డంబైనను బోకమాన. (విడిపించుకొని పోవును)

రామా:- హా! పరమేశ్వరా! పరంధామా! రామా! సర్వశిష్ట జనపరిపాలనాభీమా! నా హృదయారవిందమున నిన్ను నమ్మినదాన. నిను వేడుదాన! నా తనయుఁడు కిన్నుఁడై న్నెఱుంగక గడుయిడుమలఁ బడఁబోవుచున్నాఁడు. రక్షింప నీవేభారము.

( ధ్యానము నటించును. తెలుపడును. )



## — ద్వితీయ రంగము. —

స్థలము:— మమత పుట్టినింటి గృహాంగణము.

(తులసీదాసు వికార రూపంబున ప్రవేశించును.)

వృత్తము:—

**తుల:-** మమతా మమతా మమతేఁ గనుమీ ।
సమయంబిది రాక మతేఁ గనుమా ।
కమనీయము నా కమలాగనవే ।
తమియున దపముల్ తమిబాపగదే ॥

(అటునిటు బరుగెత్తుచుఁ బరికించిచూచి)

**మ॥** ఇదియే నా మురిపెంబుబొమ్మఁ గనగా

(ఒక బొమ్మను ముద్దుబెట్టును.)

ఇంతీ మదీయాంగనా

(మరియొక బొమ్మను బట్టును)

మదనారీ! మమతా సుధీమణి యిదే

(మరియొక బొమ్మను కౌగలించును.)

మాటాడవే ధీమణీ

(ప్రతిమాలును. పరికించిచూచి వదలును)

మద నా యౌవనరంగమందుగన నామార్గ్యాందు నామక్కువన్

(ఒక కొయ్యబొమ్మను గట్టిగ కౌగలించును)

కుదురా చెక్కిలివంటి ముద్దులిడగా బొమ్మా! యిటుల్ చూడవే॥

(ముద్దిడ మూతికి దెబ్బ దగులుట నభినయించును

ఛీ! ఇది కొయ్యబొమ్మగాని మమతాదేవి గాదు. (అని వదలి వెదకును) నా మమత యెచ్చటను

గనుపించదే. ఏమయియుండును. ఈయంతిపురంబున గాదె నాదేవి విశ్రమించుతావు. నే నెంత యెలుంగెత్తి బిల్చినను బలుకకున్నదే! నా కంఠస్వరంబు విన్నంత మాత్రంబున నామీఁదవచ్చి వ్రాలకుండునా ! ( వెదకుచుండ మమత ప్రవేశించును.) ఇదే నా ముఱిపెంబు బొమ్మ. ( అని బిగ్గఁగౌఁగలించుకొనిముద్దిడును. మమత సిగ్గునభినయించిపెనిమిటి వికారరూపముజూచి దిగ్భ్రమఁజెందిమూర్ఛిల్లిక్రిందికి జారును.) ఆహా! ఇదేటికర్మము! నా కౌఁగిటనుండి నా నెచ్చెలి జారి క్రిందఁబడి మూర్ఛిల్లినది. ఇది యొక దుశ్శకునము గాఁ గనుపించుచున్నది. (మమతకు శైత్యోపచారములు చేయును.)

కం॥ మమతా లేవే మదనుఁడు
సుమబాణములేసి దాళ సుఖమీయుటకై
కమనీయంబగు కౌఁగిలిఁ
దమిఁదీర్పుమ లేచి రమ్మ తత్తఱ పడుమా. ॥

మమ:— (లేచి యెగా దిగఁజూచి భ్రమఁజెంది) నాథా ! ఈనాఁడు భవదాకారంబు విభ్రాంతి జనక మగుట నద్భుతాశ్చర్య భీతావహములు బొడముచున్నవి. నాయందు కరుణాంతరంగుండవై నా ప్రశ్నల కుత్తరంబుఁ దయచేసిఁగాని తమ కోరిక లీడేర నేరవు. ఏమిసెలవు ?

తుల:— గ్రహచారమే! ఇదియొకజాలమా! కానిమ్ము అళ్లే యొనర్చెద.

మమ:-

ఉ॥ ప్రాణపదంబ! యేమిటిది ప్రాజ్ఞతయేపలు బంధుకోటిలో
మేనది యేమికీర్తి! కడు మేటిగ కూలము రక్తపాతమై
కానఁగ నయ్యొ కేల్య! కడు గాసిలిరా యెటు గాలివానలో
పానుపుపానుమంతముల సారవముల్ నెటుదాటి సౌధముల్
వేనముఁ గాంచవచ్చితిరొ? వేడ్కవచింపరమీకు ప్రమొక్కడల్.

తుల:-

ఉ॥ నావల పిల్లపల్లురు వివందగ జెప్పఁగ వీడె పాడుపా
నావలదర్లి దల్లిగని నాసటిబోకయు రాక చెల్వఁగా
నావలపార నిన్నుగన నాఁతిరొ యేగి అదేక దృష్టితో
నేవగ పెంతో జెందుచును నేఁదరియించితి కారుకానలన్.

ఉ॥ కానలమధ్య నుండఁగ నె గారుమొగుల్ గదుదుర్భరంబుగా
వానయు గాలి వీఁచమరువహ్ని జరింపఁగఁ బర్వుపర్వనన్
నీనదియొద్దు నద్దరికి నేగఁగ మార్గము జింత సేయఁగా
పీనుఁగు కన్పడెన్నదుట ప్రీతిఁగఁ జేకొని దాటితిన్ నదిన్.

మమ:- కటకటా! నామీఁది మోహ మెంతఁ జేయించి నది? ప్రాణముల మీఁది యాసఁగూడ వదల్చినదే!

తుల:-

మ॥ నదిలో నీఁదుచునుండఁ గొట్టుకొని చావాముగ్నితిన్ జేలితిన్
బదిలంబొ? మది మోహమగ్గలముఁ గాఁ బల్మారు నిందించితిన్

యెదలో ధైర్యము నూఁదియూఁదితుదకు న్నెట్టొ నేనోడ్డునన్
పదునాకీర్తిని ముగ్గిదేలితుదకున్ భామా కనన్ సౌధమున్॥

మమ:— కామోద్రేకమున నెట్టి ప్రియాసల పాలైతిరి? సౌధములోని కెట్లు రాఁగలిగితిరి నాథా?

తుల:-

ఉ॥ కంటిని సౌధరాజమును గంతుని పోడిమి వెచ్చనూర్చ నా
తుంటరి తంటమాపగను దొయ్యలి నిన్ బలుమారుబిల్చితిన్
మింటను మేఘగర్జనము మేదినివాయు నదీప్రవాహముల్
వింటకు నింటివారికెటు వీలగునా బలుబొబ్బరింతలున్.

మమ:— కట్టా! నాకెట్టి నిద్రాపిశాచం బావేశం బయ్యె! నా పతిమాట నవ్వడి వినినంత నే చివ్వన లేవకుందునే? ఎంతటి దుర్దినంబిది? ఆ రక్త పూరితంబునకు గతంబెయ్యది?

తుల:-

ఉ॥ కానఁగలేక దారి గల కాలను సౌధము జుట్టిచుట్టి నా
మానినిఁ గానలేననుచు మానసమందున రామచంద్రునిన్
వేనతులం బ్రార్చి కడువేగ మెత్రోవను సౌధ మెక్కఁగాఁ
గానఁగఁజేయ వేమనుచుఁ గాంతను వేడితిఁ గన్నువిచ్చితిన్

మమ:— (తనలో) కామాంధకారులకు జ్ఞాన నేత్రమిచ్చుటకుఁ గౌసల్యా కుమారుఁడే కావలయు. (ప్రకాశముగా) కన్ను విప్పగా నేమి కన్పడినది నాథా?

తుల:-

ఉ॥ వ్రాలిన త్రాడుఁ గాంచితి గవాక్షమునుండియు నేలమీఁదకున్
వ్రాలుట దానిఁబట్టి యొగిఁ బ్రాకితిసౌధముమీఁదకున్ వడిన్
జాలియటంచు నెంచకను నాఁతిరొనిన్ గవయంగవచ్చితిన్
మ్రోలను జేరుమింక గడ మ్రొక్కును గైకొని గాఁగిలింగదే.

మమ:- (ఆశ్చర్యమునభినయించి) ప్రాణేశ్వరా! యీసౌధము నుంచి యేత్రాడును వ్రేలాడుచుండలేదే? మీ రారోహణఁ జేయుటకుఁ ద్రాడెచటినుండివచ్చినది? శ్రీరాములకరుణచేతనో శ్రీకాంతుని కందువమహిమచేతనో వచ్చినది సరే. మీవస్త్రంబులు రక్తపూరితంబులగుటకు గతంబెయ్యది? నామది యాందోళనాదోదూయమానమగుచున్నది. కించిత్కాల మోపికఁబట్టి యాత్రాడును నాకుఁ జూపుఁడు.

తుల:---- అల్లదే! ఆవ్రేలాడుచున్న యా త్రాటిని జూడుము.

మమ:— (కొంచెము సమీపమునకేగి) నాథా! (భయకంపితయై) జీవితేశ్వరా! అది త్రాడుగాదు త్రాఁచు.

తుల:— (సమీపించిచూచి) అవునౌను. నీయాకారంబే మదీయమనః కమలముననిల్పి నారోహించుటచేఁ ద్రాడైనదియుఁ ద్రాచైనదియుఁ గన్పించలేదు. నారోహణభారంబున నా సర్పముగ్రక్కిన రక్తమే కాఁబోలు నావస్త్రంబుల నలంకరించినది.

మమ:-

శా॥ నామీఁదన్ దమకుండు మోహమున నా నాథా! యిటుల్ జేతురే
ఈమోహంబున మానవాళిదలచున్ యెంతేనికర్జ్యంబులన్
కామాంధత్వముగన్నుఁగప్పియచటన్ గాంచంగ లేరేవియున్
కాముండే మహిమాతి శాలియనగా గర్హ్యంబు ఛేదించుకేన్॥

మ॥ భగవంతుండు కుమారుఁడౌ మరునిచే భంగంబుఁ గావించు నా
నిగమావేద్యుల మౌనివర్యుల తపోనిష్ఠన్ మహత్త్వంబులుఁ
దగులన్ జేయును మాయపాశములలోఁ దార్మ్యరుఁ గామారుఁగా
దగునే మారుని గెల్చివచ్చుటకు నీతంత్రంబులున్ సాగునే॥

కం॥ జ్ఞానాంకుశంబుచేతన్
జ్ఞానుండను మావటీఁడు జ్ఞానాపహమౌ
మానోచ్ఛ్రయమను మదకరి
భావంబను మేద మెలమి బాపును గృపచే॥

ఉ॥ కామమె కారణంబుగదుఁ గష్టదశల్ ఘటియించె తొల్లి సు!
త్రామదశాస్య గాధిజ సుధాకరులాదిగ క్షీరపాళికే ।
బామర సత్త్వులౌ సురలు బ్రహ్మపిశాచులు నుష్మదాదులున్ ।
గామము గ్రమ్మ నంధులయి గ్రాలుదురిద్ధర మోక్షహీనులై॥

శా॥ కామోన్మదమునన్ భ్రమించుకరికాల్ కాల్ గట్టిబంధించినన్
గీమున్ సైపగ నిడ్చికొంచువడిదా ఘీంకారముల్ జేయుచున్
కామాంధత్వముచేత గోతబడియున్ గాలెత్తలేకుండి స్వే
చ్ఛామాత్రంబున బోవనేరదు విముంచన్మాన సంధానమై॥

నాథా! నాయందుఁగల వాంఛితంబును పరా
త్పరుండగు శ్రీరామచంద్రుని యందుంచిన నెంత

మేలగు. నాకై పడినపాట్లు శ్రీరామమూర్తికై బడిన నాయన యనుగ్రహంబుఁగల్గి యింద్రియ నిగ్రహంబును చిత్త పారిశుధ్యమును పరమానంద సంపదను సులభసాధ్యములగుట నిత్యానందంబునుబొందుచు సుఖింతురుగదా! మతిమంతు లగువారు తుచ్ఛసుఖంబుల నపేక్షింతురే? సురముని గురువులెల్లరు స్తుతించునట్టి బ్రహ్మానందమును పరిత్యజించి దుర్గంధమయమయిన యీదేహమును మోహించి శ్రుతిస్మృతుల మఱతురే! వైరాగ్యభాగ్యమును త్యజించి తుచ్ఛసుఖముల నపేక్షించువారు రత్నములగనిలో బొమ్మరాల గానక వాపోవు వెఱ్ఱివారు కారా? ఎట్టి స్వల్పసుఖంబున కెట్టి యకృత్యంబును జేయ సాహసింప జేసినది! స్వప్నావస్థయందుఁగూడ సహింపరాని సంభోగాభిలాషయేగదా? నిశ్చలమానసమున బ్రహ్మచర్యాశ్రమంబునందుండి భీష్మ శుక మహాఋషులవలె మోహావికారములేవియు లేక నిర్మలప్రవర్తనఁగల్గి యెల్లవారిచేఁ గీర్తింపబడుచున్న శ్రీ యాత్మారాముల మీ జనకుల ననుసరించి వైరాగ్యమున బూర్ణముగఁ బ్రకాశింపరాదా!

( తులసీదాసు స్తంభీకృతుఁడౌను. )

తుల:-- ఆహాహా? నా జనకునకును, నాకును నెంత యంతరంబున్నది? నాతండ్రి సచ్చిదానంద స్వరూపియు, సన్మార్గ సంచారియునై విషయ భోగంబులవిసర్జించి, జగద్భ్రమను బరిత్యజించి

భవబంధంబుల ఖండించి, సన్యాసాశ్రమంబును స్వీకరించి నైమిశారణ్యంబున ఋషుల నాశ్రయించి యరిషడ్వర్గమును జయించి, అంతరింపని యానందంబున నోలలాడుచున్న వాని తనయుండనై జనకునాజ్ఞల గంగగలిపి, జననియాజ్ఞల నుల్లంఘించి, విషయానలంబున విఱ్ఱవీగి బుద్ధిని మోహసాంద్రంబునముంచి తుట్టతుదకు నాచర్యలకు నా భార్యయే విసిగి విజ్ఞానంబు చెప్పునంతకు వచ్చితి. ఛీ! యీజన్మ యేటికి కాల్పనా? పురుషార్థపరుండుగాని పురుషుం డుండనేమి మండనేమి. మోహసంద్రంబున మునకలు వేయువానికి యుచితానుచిత పరిజ్ఞానము గలుగునా? కాన యికనైన నామది మాలిన్యంబు వదలువాఁడ.

సీ॥ చిత్తమా? వదలుమా! మత్తతవీకనైన
చంచలాత్ముల చెంత జరుగఁబోకు।
అజ్ఞానమా? పొమ్ము! అవివేకమింకల
నిందాస్పదులఁ జేర నీతిగాదు।
మోహమా? దర్లము! మరిపెంపుయికఁజాలు
ముప్పదిప్పలమారి ముట్టఁబోకు।
సంకల్పమా? రమ్ము! పరసంజేరఁగనిమ్ము
దైవకాంక్షనుగల్గి దరలువాఁడ।
గీ॥ రామనామంబు స్మరియించి రహినిమనుదు
తండ్రి యుపదేశములనదిఁ దర్శరుదుండు

జగ మనిత్యంబుపాపంబ • జరగఁబోకు
రాముపద కంజములఁజేరు • రాముఁగనుమి ?

మమ:- (స్వగతము) నా పుణ్యవశమున నా పతి భక్తాగ్రేసరుండయ్యె. ఏమి నా భాగ్యము!

తుల:- (మమతను జేరి)

తే॥ గీ॥ పలువిధంబులబోధించి భక్తిఁజొన్పి ।
హృదయమందున రాముని బదిలపఱిచి ।
జ్ఞానమును దెచ్చియిచ్చిన జ్ఞానమూర్తి ।
మార్గమునుజూపిదన్పిన మమతదేవి ।
హృదయపూర్వకవందనం బిదుగొతల్లి ॥

(నమస్కరించును.)

మమ:-

(చేతులఁబట్టుకొని యాశ్చర్యము నభినయించును.)

ఆహా ! యిదేటికర్మము ? నే నేమి పాపము జేసితి? నాభర్త మోహాయత్తచిత్తమడంగునట్లు రమణుల సన్నిధానంబుకంటె రామసన్నిధానంబు విముక్తిదాయకమంటిఁగాని మఱేమంటి! అందుకై ప్రాణేశ్వరా ? నన్ను తల్లీ యని సంభోదించి నమస్కరించుట సరియగునే ? మీరిట్లుజేయ నా కేదిదిక్కు ? కర్తవ్యంబెద్ది?

తుల:—

శా॥ తల్లీ!పోయి విరక్తిమార్గమున నాధన్యాత్ము శ్రీరామునిన్
నుల్లంబందున నుత్సహించి వెదుకన్ బ్రోల్లాస మెంతెంతఁగా

కల్లోలంబును జేయుచుండె సెలవా? కాంక్షింపఁగా రాముని౯
బల్లిపోయెద రామచంద్రు వెదుక౯ దధ్యంబుఁగా నిప్పుడే!

(పోఁబోవును.)

మమత:— (అనుసరించి, అడ్డముగాఁబోయిదోసిలొగ్గి)

కీర్తన.

ప్రాణనాథా! పడఁతిఁబాసి—పోవన్యాయమాయెనా?
అగ్నిసాక్షిగ నతివఁగొనియు—నరుగనిదే న్యాయమా
భక్తియుక్తులఁబలుకు పడఁతి—బాసిపోవ న్యాయమా!
భర్తఁబాయఁ బడఁతిబ్రతుకు—భారమౌను ధాత్రిలో
పతినిబాసిన సతికిరెండుఁ—గతులు గల్గకుండువే॥

తుల:- కీర్తన.

పల్లవి॥ తరలుము—దర్లుము—దల్లీ—నే—దనయుఁడఁగల్పకవల్లీ।
అను ప॥ సరసతో—రాముని—జాల—భజించెద ॥తర॥
ముక్తిదాతవే తల్లీ—నాకు—ముదముగూర్చితివె తల్లీ।
శక్తిరూపిణివి—సాక్షా—ల్లక్ష్మివి ॥తర్లు॥
అడ్డమురాకుము తల్లీ—నతు లొనర్చెదను మళ్ళీ।
చెడ్డకోరికలు—చెనటులకిచ్చి—సేవలుజేసెద రాముని పదముల॥
॥ తర్లు ॥

(తులసీదాసు పోఁబోవ మమత యడ్డమువోయి)

మమత:—

తే॥ భక్తిమార్గంబు జ్ఞప్తికి బరగఁజెప్ప।
మాతృభావంబుఁ జూపెదే మానినియ।

భార్య భారంబుగాఁ జెంచి భర్తవిడఁ
బడఁతి పడుపాట్లు గాంచవే పరమపురుష ||

చం|| పతులొక వేళ భ్రాంతిపడఁ బాపపుమార్గము లోపఁ భార్యలున్
పతులిత మార్గమై దవర నార్యుల భావము లిట్టివంచు నే
గుతుకముతోడఁ జెప్పితిని, గోప్యము టంటిని గూర్మి జంటకున్
జతురత నాదరింపు డిఁక స్వామి! యిదే శరణంటి నంటియున్ ||

(కాళ్లమీఁదఁ బడును) (తులసి దాసు లేవఁదీసి)

తుల:—

ఉ|| కాంతరో! యేలయేడ్చెదవు గంటికి మంటికి నేకధారఁగా।
శాంతము నన్ జరింపుమిఁక జాలును చాలును కామభోగముల్।
స్వాంతమునన్ సుశీలతను జయ్యన నెట్టుము నట్టి కామమున్
కాంతరో! తల్లిరో! ధృఢముగా భవదాఖ్యను నేజపించెదన్ ||

శా|| కామాసక్తతి నున్న నత్తినను గాఢాను రాగంబునన్
గామాంత్యంబును జేసితుట్టతుదకున్ గైజేసితా జ్ఞానమున్
నామీఁదాశలు నింకఁ జెంపకుసుమీ న్యాయంబు గాదింతయున్
రామాయంచుజపించుచుండుము మమతా! రారాపులన్ జెందకన్ ||

( తులసీదాసు పోవుచుంటఁ జూచి ఖిన్నరాలై )

మమ:— సీ|| పాణిపదంబందుఁ బ్రాపుగోరదు భర్త
భక్తుఁడై నిష్ఠుఁడై బరగఁ దవర
కాముకసదనంబె కైలాసమను భర్త
శ్రీరాముఁ గోరను జిత్తమలర
మమతతో సౌఖ్యంబు మరగఁ గోరదు భర్త
భక్తిశ్రద్ధల రాముభజనఁ గోర
శృంగారసరసీలోఁ జెలఁగెడు నాభర్త
భజనరాముని జేయు భద్రముగను।

తే॥ మమతమమతవు మరగెదు మాన్యుఁడవహా
రామరామంచు జపియించు రక్తిఁదోడఁ
బ్రాణనాథుండు నాభర్త ప్రాణసఖుఁడు
పోవుచున్నాఁడు భక్తుఁడై తావువీడి.

(అడ్డముగా బోయి) నాథా! పోవలదు.

-॥ కీర్తన ॥-

మమ:— పోవలదు॥ పోవలదు నాథా! ॥ యిటునొంటరిగ నను విడి ॥ పోవ ॥

తుల:— పోవలయు॥ పోవలయు మమతా॥ పావనగ రాముని వెదకఁగ ॥ పోవ ॥

మమ:— కటకటఁ బడుచును॥ గతిలేఁ దాల్చుచుఁ॥ బటుతరముగ నీ॥ పత్నినివిడచిటు ॥పో॥

తుల:— పటుతరముగు॥ నా బ్రహ్మజ్ఞానము॥ దిటముగఁ జేరఁగ॥ రాముని సన్నిధి ॥ పో॥

మమ:— మరులుగొల్పఁగను॥ మమతను జూడక॥ సరస మెయిటువిడి జరుగఁ వనముల ॥పో॥

తుల:— హరిని గొల్వఁగను॥ మరగితి మదిలో॥ పరమదాయి నీ॥ వరప్రసాదిని ॥పో॥

మమ:— పతిత పావనులఁ॥ పతులు వేగగను॥ పతివ్రత లెందును॥ బారరె జతగను ॥పో॥

తుల:— పొందుము సిద్ధిని॥ నొందుము భక్తిని॥ జెందుము ముక్తిని॥ శ్రీఘ్రిత భక్తిని ॥పో॥

ఉ॥ నమ్మతివేని భర్తగను పాపలుకుల్ బలియించితేని నా
సమ్మతిఁ గొందువేని, నటుస్వామిని రాముని గొల్చిపూజలన్

యిమ్ముగఁ జేయుచుండు భవదీప్సితముల్ సమకూరుచుండుఁ జే
కొమ్మ మదీయ వాక్యముల గోప్యముగా మమతామతాగతా !

మమ:— నాథా !

ఉ॥ నిన్నెడఁ బాసియుండఁగల నేర్పిసుమంతయు లేక యుండుటన్।
వెన్నలరారుచుండె మదిఁ జెందెడు భావము జంచలత్వమున్।
నెన్న డెఱుంగ నిట్లగుట నీప్సిత మెట్లుగఁ జేయఁజాలుదున్।
విన్నదనంబు బూనుటకు వింతగ దాపతివీడియుండుటల్ ॥

నా ప్రాణపదంబుగఁ బూజించు నా భర్తనెడఁ బాసి జీవించుట కల్ల! కాకున్న యీనిముషమునకుఁ బూర్వమెన్నఁడైన నిట్టియెడఁబాటుగల్గునని దలంచితినే! తలంపకున్న పతికిట్టి వైరాగ్యం బంకురించునా! ఇంక నాకుఁ దెరువెయ్యది?

ఉ॥ ఎవ్వరు సంతసంబున మదీప్సితముల్ సమకూర్చుచుండునో!
ఎవ్వరు ప్రేమ పుంజమును నిచ్చ జనింప నొసంగుచుండునో।
ఎవ్వరు కౌఁగిటం బొదవి యేకముగా దనియింపుచుండెనో।
ఎవ్వరు "ప్రాణకాంత" యని నేర్పడ ముద్దులొసంగుచుండెనో।
ఆవ్వలరాజు నర్చకుఁడ యవ్వనజాక్షుని దాసుఁడయ్యెఁబో॥

అట్టివారిట్టి వారయ్యె! నామనోనాథుఁడు నా బహిః ప్రాణము నన్ను విడనాడిన నా యునికియే యీ జన్మము వ్యర్థముగాదా!

(అని మూర్ఛపోవును)

తుల:— మమతాదేవి మూర్ఛిల్లినది! ఇదే సమయము.

-• కీర్తన •-

దండము• దండము నాతల్లీ—చెంతను దుఃఖము నాతల్లీ॥
(కాంత దవ్వరిగి)
దండము దండము సాధువులు—దరలికపరమానందమున॥
(భక్తులఁ గాంచి)
దండము భక్తాగ్రేసరులు—దశరథరామునిఁ జూచితిరే॥
(పెద్దలమఁ గని)
దండము విబుధాగ్రేసరులు—దనరఁగ రామునిఁ గాంచితిరే॥

శ్రీకాంతా సన్నిభులారా! శ్రీరామచంద్రుడితో నవహంకారము నుపనచ్చిరే? ఓతపోనిష్ఠా గరిష్ఠులారా! సదానంద సంధాయకుండగు శ్రీరాముఁడు మీ సన్నిధి నుండిరే! అప్రతిమప్రభా భాసమానుండగు శ్రీరాముఁడు నక్షనంబునడంపనీపథంబున వచ్చిరా! ఓభక్తాగ్రేసగులారా! కరుణాసముద్రుంను భక్త వత్సలుండు శ్రీరామచంద్రుండు మిమ్ములను దుర్విచార చిత్తులను మోహాంధకార మగ్నులను పరిపాలింప నిచ్చుటకు వచ్చెనా. ఎవ్వరును నామాటకు ప్రత్యుత్తరం బీయక గుడ్లగూబలవలె నాకైయట్లు చూచెదరేల. వీరిజోలి నాకేల? నాదారిని నేబోయి శ్రీరామసన్నిధానంబుఁ జేరి శ్రీరామమూర్తితో నానేరంబులు నేనేవిన్న వించుకొం మెద! అల్లదుగో! పోయిపట్టెదఁగాక. (పరువెత్తును.)

(తెర పడును.)





# గోస్వామి తులసీదాస నాటకము.

## చతుర్థాంకము.

### —ప్రథమరంగము.—

(కాశీనగర వీధిలో తులసీదాసు వెఱ్ఱిభక్తుఁడై రామునిఁజూడఁ బ్రయత్నించుచు)

కీర్తన.

తులసి:—

రామునిఁగన్నులఁజూచెదను—శ్రీ—రామునికరుణనుగాంచెదను
ధీరతఁబూజలఁజేసెదను— నే — గోరదరామునిఁగూడఁగను
సారమురాముని బాడినను—సం—సారమురోసిన మేలగును
అడుగో రాముఁడు వచ్చెనిటు—గడు—మోదము నాకిఁలఁగూర్పఁగను
విడువను పాదము బట్టెదను—ఎద—కడువడి రామునిఁ దలఁచెదను॥

(అని పాడుచు నాకాశమువంకఁ జూచుచుండును.)

[ రామాబాయి మమతాదేవి ప్రవేశము. ]

రామా:— (కౌఁగలించుకొని) తనయా! సుగుణసముదయా! యేలరా నీకిట్టికష్టము! ఇట్లున్న నిన్ను నే గన్నులారఁ జూచియు సహింపఁగలనా!

తుల:-- అమ్మా! కన్నతల్లీ! నీకునమస్కారము. కన్నులు పండువుగఁ గన్నులారఁ గమలదళేక్షణుని నొక్క సారిచూచి తరింపుము తల్లీ!

(అనిఆకాశమువంక చూపును)

రామా:-- (ఆకసమువంకఁజూచి) అచ్చట నేమున్నదిరా! తనయా! తనువునఁ దర్లుటచేఁ దరింపఁ జేతువను కుతూహలమున నుంటిరా బిడ్డా!

కీర్తన.

తుల:- తరింపజేయును రాముని—గురించి జపించు రాముని

రామా:-- పుత్రా పైవంకఁజూచెద వేమున్నది! శూన్యంబున శోభిల్లెద వేలరా?

కీర్తన.

తుల:-- చూచినరామునిఁజూచెద నే—కాఁచినరాముఁడె కాచుఁగదే

రామా:--ఆకసము శూన్యమేగదా! అందుండునదేమి?

తుల:--శూన్యము నీవే! శూన్యము నేనే! మాన్యుఁడు రాముఁడు మానక నిలచును!

రామా:-- ఎట్టిచిత్తమెంతలో నెట్లుమారెను! నాయందుఁ గరిసను దాల్చెద వే?

కీర్తన.

తుల:-కనికరమునకై కాచితి వేచితిఁ బవివడి రామునిఁ బరుగునఁ గాంచెద

రామా:-- బిడ్డా ఎటువంటివాఁడ వెట్టివాఁడవైతివి.

సీ|| రాచబాటలు నీకు| రాజమందిరమాయెఁ
బాదు నేలలు పూలపాన్పులాయె|

13

పంకంబు మెఱుఁగాయెఁ బరువడుగురులకు
నవగోచి చీనిచీనాంబరంబె
భిక్షాన్న మాబిడ్డ ప్రీతిమృష్టాన్నంబుఁ
గాదు పాత్రిగుడ్డ శృంగారమాయె
భీరువై ప్రభవింతు బెంపెక్క మంత్రివి
పసదూలుటలు నీకుఁబరువులయ్యె

తే॥ గీ॥ ఇట్టి కవింపుఁ గలిఁజూచి యెట్టులోర్తు
నిట్టిదురవస్థ పాలాట యేటికయ్య
దిట్టతనమున గృహమున రట్టు; భక్తు
లైచరింపరమీ తండ్రియంతవారు.

కీర్తన.

తుల:— మేడలైతే నేమిటే — మరిమిద్దెలైతే నేమిటే
కూడిరాముని గొల్చుటకును — నుండుటనగా నేమిటే॥
అన్నమైతే నేమిటే — భి — క్షాన్నమైతే నేమిటే
చెన్నుమీరఁగ రాముఁజేరఁగఁ జింతపడుటది యేటికే
రాజులైతే నేమిటే — యిల — రాజులైతే నేమిటే
ముందురామునిఁ జూడఁగోరెడి మూఢభక్తులకిద్దర
లోక సుఖమన నేమిటే — పర — లోక సుఖమది కాదటే
సాకురాముని నాత్మలోపల — సాదరంబునఁ గొల్చినన్

రామా:— కుమారా! ఏలరా! నీకీ భ్రాంతి? సుఖముగ నింటనుండి శ్రీరామమూర్తిని భక్తిసేవించి హరిభక్తులై దనరి గృహస్థులై మీతండ్రి తరియింపు చుండుట లేదా? నీవు వారి ననుసరింప

రాదా! నామాట నూహించి యింటికి రమ్మా.
నీ యిష్టార్థంబుఁ గొనుము.

కీర్తన

తుల॥:— కన్నతల్లి — సన్నజెప్ప — నున్న తావును
చెన్నుమీర — రామునెందుఁ—జూచితమ్మరో
రాముఁజూచి రక్షయంటె—రామమూర్తిరహినిగంటె
రామనామ—నీమమెంత—రాముఁడిందురాఁడతల్లి
గురుద్రోహ మెంతో జేసి—గుఱుతులేని నీచతముఁడ
నరకుఁగొనడుఁ వినఁడు రాఁడు—బరమపావనుండు రాము
నిరుపమాన సుందరుండు—గరుణ భక్తవత్సలుండు।
మొఱలువినెడి మోక్షదాత—కరుణనింపవచ్చువాఁడు

రామా:— తనయా! శ్రీరాముని మనసార దలంచుచుఁ జింతించుచు, జపించుచుఁ గన్నతావుననే గానవచ్చును. తడవుసేయక గృహంబునకుఁ బోదము రమ్ము. లెమ్ము.

కీర్తన. ధన్యాసి రాగం. రూపక తాళం

తుల:- అమ్మరో! కదలక దలిబోవుమా। నెమ్మనమున నీతియునుచు
రామా:— సుతుఁడవా! కుతుక ప్రేమ పుంజమా! బ్రతుకఁగలనా నిన్నువీడి॥
తుల:— అమ్మా జననిజనకులెంతో —తమక ముగలిగినఫల మేటు॥
రామ:— పుత్రా। భారంబాగా—వీడన్

తుల:— రామకృత మెప్పుడున్॰ యిల రాణువైదవరున్॰ ఇది నీమ
మంచుచెంచి॰ నేనుమింతటననుఁ దలపకుమా॥

రామా:— నీవీవిధము నా— పదలన్— వెతలన్ — జెలంగఁగను
లారఁగ నేతనయా— నాతండ్రీ — నినుఁజూ — చితి
నే— నెటులన్ తాలంగి— జననా— నెటులన్॥

తుల:— శ్రీ— హరిహరా— కవికరా— ననునీకరుణన్— కరుణించుము
నాజననిన్— సుత— కనినుఃఖము గదపుము— వడపుము,
నెమ్మది గనఁగను॥

రామా—: నాపుత్రి! పలుకు పలుకు—నాపాల— కడలశయను
ధ్యాన్నంబు సలుపుచుండెదవు॥

ఇఁక నేమిచేయుదు. (అనినిశ్చేష్టు డగును.)

(మమతాదేవి సాష్టాంగ పడును.)

మమ:— నాథా! పురుషార్థ ప్రదాతా.

ఉ॥ పాపిని, భ్రష్టురాల, పతిఁబాపఁగఁజేసిన పాపపత్నినిఁ
శాపదవాగ్ని కీలలను జావక యుండిగ నున్నదానవు!
కోపముదీరఁ జంపుమిఁకఁ గూడని కార్యమొనర్చుపత్నినిన్,
యీపగలేల యిందులకు నిశ్వాసుచావఁగఁ బ్రాణవల్లభా!

నా నాథుండు నావలనఁ గదా యింత దురంత
చింతల పాలయ్యె.

కీర్తన. హిందూస్థానిరాగము. అదితాళము.

మమ:— నాప్రియరమ్మా—ననుఁజేకొమ్మా—నన్నిటుపీడకుమా
గతిగన, సతికిటు, కుతుకము గూర్చుము

తుల-- రామునిఁజూపి- కామముఁబాపి- నియతిని నుండవుగా।
అడలకు, తడబడి, నడువు, నడువుమీ

మమ- మనోనాథా! నన్నువిడనాడితివో। మనంబెట్లు కలిగెనిక ।
మనుదు మదనుని- మరుశరబాధకు॥

తుల:-- మాతా నీకీ—రీతిఁ బలుకఁ మానక పాపము వొదవుఁ
దశరథ తనయుని- దలువుమయెదలో॥

మను:— మీయాజ్ఞాను వర్తినినై శ్రీరామచంద్రునిఁ దలంచుచుఁ దమపాదకమల పూజఁగావించుచుఁ గాలము గడపెద. ఆనతిండు.

(తులసీదాసూరకుండును.)

నాథా! మీస్థితిమీకుఁ దెలియునా? ఇట్లగుటకు నేనేకదా కారణము. అట్లగుటంజేసి యేకదా "చేతులారఁ జేసికొనిన దనుభవింపక దీఱునా" యని పలువురు బల్కఁజొచ్చిరి. ఏలయన:-

ఉ॥ చీకిరి బాకిరిన్ గురులు చిందర వందర జెందదేహమా।
హా!కృశియింపఁజొచ్చె, తనువా! చెలువారపుదక్క గట్టుసు
క్కాకులపాటుఁజెందెఁగులకాంతను మ్రొక్కదదాసురాలనా
హా! కమనీయ రూపగుణాకర చిన్మయ భక్తరత్నమా!

ఇంతగగ్గోలు బెట్టిన నింతయైన నీప్సిధంబనరు.

చం॥ పలుకరు పల్కరించినను? బాల్పడ నెంచరికట్టి కష్టమో।
ఇలఁగలభాగ్యభోగ్యముల నెంతయుఁ బాసిరియాప్సితంబునన్

గులుకుమిటారులన్ గనరు కూర్మిని నేలను బవ్వళించు వా।
యలవడెనెట్లు నాపతికి నార్యపదంబుఁ దరింప నిట్టులన్॥

తుల:— కీర్తన.

రామునికన్నులఁజూచెదము శ్రీరాముని కరుణను గాంచెదము

మమ :— భజనల రామునిఁ గాంచగను నిజమందిరమున కేగుదమా

తుల:— కరముల మ్రొక్కుము రాములకు శరణని వేడుము స్వాములను

మమ:— కులదేవత నటుగొలిచెదము యిలుజేరటుల నెఁ యేగదము

తుల:— ఆరాటములను అలరకుమా శ్రీరామునిదయ జెందుసుమా

మమ:— మాటకుమారుగ మాటలనే దీటుగఁ జెప్పవు ధీరుఁడవే

తుల:— పాడినరాముని పాటలనే యాడినరాముని యాటలనే
ఆడుము పాడుము అల్లదుగో తోడగు నీడగు దొరయదుగో

(నిష్క్రమించును)

మమ :-- ఆహాహా! ఈపుణ్యాత్మునకుఁ బరంధాముని యందుండు ధ్యాన భార్యయం దిసుమంతయు లేకపోయెనే. అట్లుగాకున్న నేనుదనతో నాడినను బాడినను ఎంత బ్రతిమాలినను రవ్వంతయేని జెవి సోకకుండునా? నాదురదృష్టమిట్లుండ నెవ్వరేమి చేయఁగలరు. (అత్తగారిని గాఁగలించుకొని) అత్తయ్యా! మీ తనయుఁడు

సీ॥ నానాథుఁడిసుమంత నాపల్కు వినఁడింత
నాచెంతనుండఁగ నోచనింత
నాకాంక్షఁ గనఁడింత నను జేరరాఁడింత
నా వ్రాఁతఫలమింత నాకుఁ జింత

నాప్రాణధనమింత నను గోరఁడిసుమంత
స్వామిజూచెడు నాకసంబువింత
నాగోడు వినుమంత రాఁగోరఁడోలింత
వయమింతఁజూపఁడు నాసనుంత

తే॥ గీ॥ లోకమునువీడియున్నారు రూఢమతిని
జిత్తమేకాగ్రితను జేసిచేష్టలుడిగి
రామరామ! విరక్తతరహిని దనరె
మీకుపుత్రులు నాభర్త మేటివార్త

రామా:- మమతా యేలయిట్లు సుమతిఁ జేమరగెదవు. నా నిమనంబు నిశ్చలభావంబున నాపరాత్పరుండగు శ్రీరామచంద్రుని యందు లీనమై తదేక నిష్ఠా గరిష్ఠుండై యున్నవాఁడు. మనము బాహ్యంబున నుండి మాటలాడిన బయలోపలనుండు వాసికెల్లు గోచరంబగును. ఇఁక మనమెన్ని తెఱఁగులఁ జలింపఁ జేయఁ బ్రయత్నించినను ప్రయోజనము లేదు. నేనిప్పుడేపోయి నీమామగారి కీసంగతి నివేదించెద.

మమ:-- అత్తయ్యా! మీరుమామగారి చెంత కేగనుంటిరి. సరియే నేననాథనై యుండగలనా? గాన నాయందు పరిపూర్ణ కటాక్షమున మనయావదాస్తియు శ్రీరామార్పితంబుగ నిచ్చటమఠంబుఁ గట్టించి యోగిబృందంబుల కిరవుజేయనాకోరిక. అట్లు జేసిన యీ కాశీపురంబున నేను నాకాంతునిఁ

గండ్లారఁ జూచుచు నానందించుచుఁ గాలంబు గడుపుదాన. సెలవిండు.

రామా:-_ మమతా! నీమనోభీష్టంబున నీయిచ్ఛవచ్చిన చొప్పున నెరవేర్చుకొనుము. నేఁబోయెద.

(నిష్క్రమించును)

మమ:-- నే నిప్పుడే రాజాపురమున కేగి నా భాగ్యము నిటకుఁ దెచ్చెదఁగాక. (నిష్క్రమించును)

(తులసీదాసు ప్రవేశము)

కీర్తన.

తుల:- దయఁగనుమా రామా దీనుఁడ శరణంటిని నీదిక్కనుకొంటిని
నంటిని, యుంటిని, బంటనొంటిగ॥

భజ భజ భజరే శ్రీరామం భజగోవిందం రఘు రామం
శరణుశరణు శ్రీరఘురామం శరణంటినిగద శ్రీరామం
చరణములంటఁగ రఘురామం సాఁగిలిగొలిచెద శ్రీరామం

(ఆకాశమువంకఁ జూచి నమస్కరింపుచుండ నొక వృద్ధబ్రాహ్మణుఁడు ప్రవేశించును)

బ్రాహ్మ:— ఎవరీ భక్తాగ్రేసరుఁడు! నిజభక్తమందార ధామంబు. అసాధారణప్రజ్ఞాధురీణుఁడు. యోగ వైరాగ్యంబులందుఁ బ్రవత్తిగల్గి యప్రమత్త చిత్తుండై సర్వాంతర్యామియగు నారాయణునిఁ గాంచి యానందింప నుంకించు రామనామశక్తి లోకవస్తుపరిజ్ఞాన విరక్తి రామసందర్శనాశక్తిఁ

జూడఁ జూడనాకు దాసోహము జేయ మన
స్సుప్పొంగుచున్నది. కారణము లేక యుండునా!
ఆ భక్తమందారు నాశ్రయించెద. (సమీపించి)
శ్రీ రామచంద్ర! భక్తమందారా! నమస్కృతులు.

తుల:— ఆర్యోత్తమా! ఓహోరు! మా శ్రీరామచంద్రుని
జూచితిరా! పూజించితిరా!

బ్రాహ్మ:- శ్రీరామచంద్రుఁడు భక్తాగ్రేసరు లెందెందు
జరించుచుందురో యందందుఁ దప్పక వచ్చు
చుందురు. నా రామమందిరమునకు దయచేసినఁ
దమకోరిక తప్పక యీడేరును.

తుల:- శ్రీరామమూర్తి మందిరమునకా! తప్పక వచ్చెద.
తరుణకిరణవాతములు జల్లారజల్లార నాకారాట
నుపశమింపనుపశమింప మెల్ల మెల్లన వచ్చువాఁడ
మీరుపొండు.

(మహాత్ముఁడు నిష్క్రమించును. ఆత్మారాముఁడు
రామాబాయి ప్రవేశింతురు.)

తు:- జననీజనకులారా నమస్కారము. తండ్రీ! కాదు.
గురూత్తమా! కాదు. శ్రీరామచంద్ర పాదార
వింద పరిశ్వక్త హృదయానందకరా! నమస్కా
రము. నాకుఁ జేసిన సదుపదేశమునం గొరంత
యుండుటంజేసి పరిపూర్ణానుగ్రహంబున నిటకు
విచ్చేసియుందురు. కాన నే నాత్మారామసాన్ని
ధ్యము ప్రత్యక్షముగ గాంచలేకుంటి. పరిపూ

ర్జ్ఞానుగ్రహముంచి తక్కుంగల జ్ఞానోపదేశంబు
జేయఁ బ్రార్థించుచున్నాను.

ఆ. రా:- నాయనా! నీకు జెప్పందగిన దంతయు నీ
యజ్ఞానదశయందే చెప్పియున్నాను. జ్ఞప్తికిఁ దెచ్చు
కొనుము. మీయమ్మవలన నేసకలంబును వింటి.
సంతసించితి. నేనింక సిద్ధిఁ బొందనుంటిఁ గాన
నీకోరిక నెరవేర్చిపోయెద. లేకున్న నాకుఁ దిరిగి
జన్మసిద్ధించుఁ గాన నీవు నన్ను గంగయందు వద
లుము. ఇదియే నే కోరు గురుదక్షిణ.

తుల:- హా! ఎంత మాటవింటి. అజ్ఞానాంధ కారంబున
నుండ జ్ఞాననేత్రంబు నిచ్చి తిమిర మడంచిన
గురూత్తము లేగెదరా!

ఆ. రా:- ఏమీ! ఇంకను అజ్ఞానాంధ కారంబున నుంటివా?

తుల:- తండ్రీ! ఆగ్రహింపకుము. తనయుఁడ నౌటచే
నట్లంటి. ఇదిలోకానుభవమని దెలిసితి. మీబొం
దెను గంగలోఁ గలుపనాకేల జాలిగలదు. ఈ
కాయంబులఁ గాల్పనేగదా కల్గినవి. చింతవదలితి.
సంతసంబుచేబూనితి. చిత్తశుద్ధి నుంటి. చిత్త
గింపుమంటి. శ్రీరాముఁ జూపుగొంటి.

ఆ. రా:- అట్లే చిత్తశుద్ధి నుండుము. (చెవిలో నుపదేశము
చేసి బుజములపై నొఱగును. జీవముల వదల తేజము
గాన్పించును.)

గంగాతటమున తులసీదాసు జపమొనర్చుట.



**Tulsidass.**

రామా:- (తేజమును జూచి.) హా ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లును)

తుల:- (తేజస్సునకు నమస్కరించి) హా! గురూ! తండ్రీ! పోతివా! చిత్తమా! చపలంబుఁ గనకుము. ధైర్యమా! అవహింపుము. (ఆత్మారాముని భుజములపై నిదుకొనిపోవ రామాభాయి లేచి పోవుచున్న తనయునిఁ జూచి)

రామా:- హా నాథా! హా తనయా! నా నాథుండు బోవ నే నుండి యేమి ప్రయోజనము. నా భర్తతో నేను గూడ గంగలో బడి పతికి పరలోకమందు గూడ తోడై యుండెద. (పరుగిడును. నీటఁబడిన రెండు శబ్దములు వినఁబడును.)

(తులసీదాసు తిరుగ ప్రవేశించి)

నాజన్మ కారకులగు జననీ జనకులు గంగా ప్రవేశమైరి. నాజన్మ సాఫల్యంబయ్యె. నా జనకుం డుపదేశించి నందులకు వారికోరిక ప్రకారముః వారిని గంగలో గలిపి తరించితిని. నాజననియు నేనెంత జెప్పినను వినక నాజనకుని ననుసరించినది. నాజన్మ కృతార్థతఁ జెందినది. నేనిఁకఁ బోయి నారామచంద్రుని జపింప రామ మందిరమునకుఁ బోయెద. (నిష్క్రమించును.)

—: ద్వితీయ రంగము :—

స్థలము:- కాశీనగరమున మమతా మంటపము.

(మమత మంటపమున నుండును.)

మమ:— నాసర్వసంపదలు పవిత్రులును పరమ పావనులును నగు పరమ నిష్ఠాతపోధనులకు నిరవు పట్టుగఁ జేసితి. నేనును వారియూడిగము జేసివారు నాసపర్యలకు మెచ్చియిచ్చిన శుద్ధోదకముచేత శరీరయాత్రను జరుపుచుంటి. ఈశరీరమును బుధసేవా పరతంత్రతచే పరిశుద్ధముజేయుచు మన్మనోనాథు, భక్తమందారు, దివ్యసుందర విగ్రహుని గాంచి యానందించుచుఁ గాలము గడపుచుంటిని. అత్తమామలు గాలాంతము నొంది కృతార్థతను జెందిరి. ఇఁకనాకు లోకంబునఁ గోరఁదగినది లేదుగదా! శ్రీ సీతారామ సందర్శన కుతూహలంబు దప్ప మఱొండు లేదు. లోకంబున జన్మమెత్తినందులకు నింత కంటె గావలసినదేమున్నది.

(బ్రాహ్మణి ప్రవేశము.)

అమ్మా మీరెవ్వరు? మీరెచటనుండి యేతెంచుచుంటిరి.

బ్రాహ్మ:- పరమపురుషు నర్ధాంగిలక్ష్మి వగు నోమమతా దేవీ! నీకు నమస్కారము. నేనొక బ్రాహ్మణ

స్త్రీని. భక్తమందారుండగు తులసీదాసులచే శాపవిముక్తనై నానిజరూపంబు గనినదాన.

మమ:-- అమ్మా! తమకాయాసంబుగా నొంచరేని, తత్కథావిధానంబును సాకల్యంబుగ నెఱింగించి నన్ను గృతార్థను జేయఁ బ్రార్థించుచున్నదాన.

బ్రాహ్మ- అమ్మగారూ! ఈ వృత్తాంతంబు తమకు విన్నవించుకొనుటకే యిచ్చటకువచ్చితి. తాము సావధానులరై యుందురేని జెప్పెద.

మమ:-- అమ్మా! సవిస్తరంబు విన కుతూహల పడుచున్నదాన.

బ్రాహ్మ:-- ఆ॥ వె॥ రామమంటపంబు రయమున గట్టించి
రామ భక్తుఁడనగ రహిని దనరు
బ్రాహ్మణోత్తమునకు పరగు సత్సతినాదు
పరమ పాపినాచు బరగుదాన ॥

మమ:-- అమ్మా! పరమపావనవ్రతుని బడంతివైన నీ వెట్లు పరమపాతకి వౌదువమ్మా?

బ్రాహ్మ:-- తే॥ పరమపావనుఁ డైనట్టి బ్రాహ్మణునకు
పరమపాతకి భార్యనై బరఁగి తకట!
భానునందున వేడిమి బ్రబలినట్లు
పుష్పములయందు ముండ్లు దా బొడమినట్లు ॥

మమ:-- అదెట్లు తల్లీ!

బ్రాహ్మ:-

ఉ॥ కామమత్తిక మింపఁగను కంటికి నింపగు మిండగాండ్రనే
ప్రేమనుగూడి సౌఖ్యముల బ్రీతియటంచుమదిం దలంచితిన్
వేమరు భర్తవాఙ్మలను వేడ్కఁ దలంపక మిండగాండ్రకై
ధీమహి భర్త వీడితిని ధీరజారిణినై జరించితిన్ ॥

మమ:- పరనిందాస్పదం బగు జారత్వంబు పరమ పురుషుండెట్లు భరించెను.

బ్రాహ్మ:-

చం॥ పరపురుషాళిఁగూడు సతిభావమునన్ గొనబోదు సర్వమున్
గుఱుతుగ కామసౌఖ్యములె కోరును మెచ్చును కాముకాదులన్
సరసులతోడ కాలమును జక్కఁగబుచ్చితి నంతకాలమున్
పరమదయాళుఁడౌ పతియె బాగుగ నా నడతల్ గ్రహించిదాఁ
దఱచుగ సామభేదముల దానమొనర్చిన లొంగకుండుటన్ ॥

మమ:- అమ్మా! ఇట్టి దుష్టత్వంబును విని కనియుండుటయెగాక సామదాన భేదోపాయములఁగూడఁ ద్రిప్పఁజూచెనుగా! అప్పటికైన మీమతి తిరిగినదా?

బ్రాహ్మ:- అదెట్లుతిరుగును! ఆఁడుదాని యారాటమంతటితో దీఱునా?

చం॥ వినికని భర్తయోర్పుకొని విజ్ఞుడుమాటలచేతఁ ద్రిప్పఁగాఁ
జనదని యెంతజెప్పినను జాలినిజెందుచు నీతిఁజెప్పినన్
విని గనరాని మోహమున వేడ్కవిటుల్ ననుగౌఁగలించుటల్!
గనియెను నొక్కనాఁడు తనకండ్లను జూచెను పాపకృత్యమున్ ॥

మమ:- ఆహాహా! ఆమహానుభావుని యోర్పు.

బాహ్మ:- నిర్భీతిని నే జరించుటజూచి నా చేష్టల నన్ను శిక్షించినగాని మానననిదలంచి,

తే॥ ఓపలేనింక నీ జేయు పాపములను
ఆపలేనింక; రాక్షస రూపమెత్తు
మంచు శపియించిదపియింపు మంచు వేగ
నసురరూపంబు దాల్చితి నంతలోన ॥

కం ॥ వేడితి శాపముదీర్పగఁ
బాడితి నా భర్తనెంతొ ప్రతిమాలితి నా
కోడిగ పుపనులు మరువఁగ
మోడిగ నుండుటనుజూచి మోదముతోడన్ ॥

బ్రాహ్మణులౌటచే తనకోపఁబు చల్లారియిట్లనియె

తే॥ గీ॥ రామమత మెుండుకట్టించి రంజితముగ
భక్తులను నందునుంచెద బండనొకటి
వాకిటను నుంచెదను వారి పాదజలము
నందు నివసించుసతతంబు సార్యభక్త
పాదజలములు పుష్కర వర్షములను
నీకు గల్గినశాపంబు నీల్గునంత ॥

అని చెప్పిపోయెను. నెనట్లె రక్కసినై నా మంట పము ముంగిటనుండు బండక్రిందనుండ నేటికిద్వాదశ వర్షములనుండి శ్రీ తులసీదాస భక్తాగ్రేసరు పదజలంబుల నా పాప పంకంబును శుద్ధిఁజేయ నా నిజరూపంబును దాల్చితిని. ఆ స్వామిని వారి కోరికఁదెల్పిన నెర వేర్చెద నని మడుగవిముఖుండయ్యె. అంత నాయానిజవృత్తాంత

మును దెల్పి వేడఁదాను శ్రీరామచంద్రునిఁజూచు తెరవుదె
ల్పుమన, మారాజగు భేతాళునొద్దకుఁబోయి తెర వెఱింగి
నేనే తెంచి యిట్లు విన్నవించితి.

మమ:— భేతాళుం డంతటి దయామయుండా ?

బ్రాహ్మ:- వారి కరుణాకటాక్షమునకు గారణము నా
శాప విమోచనమే.

మమ:-- ఏమని చెప్పె ?

బ్రాహ్మ:- ఆ॥ వె॥ వారాణాసియందు పౌరాణికుఁడు నిత్య
మతని గృహమునందు గుతుకమలర
రయము విగారఁ జెప్ప రామాయణంబును
శ్రోతలటకు బోవు చోద్యముగను ॥

తే॥ గీ॥ శ్రోతలందరికం టెను జేరవఁగల్గి
మునుపచ్చును వినియొంతో మోదమలర
పోవునందరు సభనుండి బోవువెనక
వృద్ధ బ్రాహ్మణ రూపంబు వొదవి హనుమ॥

తే॥ ఆంజనేయుని యీ వృద్ధ వార్యబట్టి
భక్తి గొల్చియు వదలక బట్టుబట్ట
రామదర్శన మొదవును రామదూత
నొండువిధమున గలుగదు నొగులు లేదు.

క॥ చెప్పినజొప్పును జెప్పితిఁ
దప్పక నాతులసిదాసు దఁయగైలాసం

బాప్పఁగ నేగుచునుంటిని
జెప్పితి మీ భర్తకతను చింతను బాయన్॥

మమ:- అమ్మా! మీ పుణ్యవశంబున నాభర్తకు శ్రీ రామ సందర్శనము గలుగు తెర వెలుఁగఁగలిగె. మీరెంతయు వందనీయులు. నేనెంతయుఁ గృతార్థురాల నంజలిజేసి మ్రొక్కెదఁ గైకొనుఁడు.

(నమస్కరించును.)

బ్రాహ్మ:-నీభర్త పుణ్యచారిత్రుండు. భక్తుండు. నీవునట్టి భక్తుల వేనవేలఁ గొలచి మెప్పువడసిన దానవు. అట్టి దానవు నాకు మ్రొక్కుట న్యాయము గాదు. అమ్మా! పుణ్యవతీ! నాయందు నీకుఁ గరుణగల దేని లోకమున నావంటి పాపి జవరాండ్రకు బుద్ధి గలుగునట్లు నీతినేర్పి వారి నట్టి పాపకృత్యముల నుండి తొలఁగింపుము. నే బోవుదాన.

(అని నిష్క్రమించును.)

మమ:-

కం॥ రామా! నీ భక్తుండును
వేమారు భజింపుచుండె వినిక నియెుఁగన్!
నీమంబున భజియించెడు
పామరుఁడగు తులసిదాసు భక్తునిగనుమా॥

తే॥ రామభక్తుఁడు వంజని రామసుతుఁడు
సంద్రములదాటి సీతను జాలిఁగనిన।
బాహుబలవంతు హనుమంతు బ్రస్తుతింతు
భర్త దరిజేర్చి శ్రీరాము బరగజూపు॥

కం॥ పెనిమిటికే సెడి పుణ్యము
చెనటులు స్త్రీజనులుగూడ జేకొను సగమున్
వినమిత చరితుఁడు దాసుఁడు
గనగల్గిన రాముచంతి గగెదను నేను౯.

చం॥ పతివిడ దైవ మేడ సతిభావమున౯ దలపోసి చూచిన౯
పతిసతి ప్రీతుఁడై తనర భామవిభావిత భాసురాంగి శ్రీ
మతిపురుషార్థ వర్ధనియె మానవతీ తిలకంబు స్వర్గహా ।
కుతుకముతోడ జెందనగు గూఢజయిన్నిటి జెందనేర్చునే.

గాన మునుల సేవకై బోయెద.

( నిష్క్రమించును. )





# గోస్వామి తులసీదాస నాటకము

## పంచమాంకము.

### —•ప్రథమ రంగము.•—

స్థలము:— కాశీనగర రాజవీధి.

(తులసీదాసు ప్రవేశము)

ఉ॥ మేదిని నెల్లవేళలను మీశుభనామము సంస్మరించు నే।
మీదయనింపుమంచునుదయిన్ మది బ్రార్థనచేయుచుందు నే।
మీదగుభృత్య భృత్యులకు- మెప్పుగ నిత్యము సేవఁజేయు నే।
నాదగుయీప్సితంబు కరుణాకర రాఘవముక్తి దాయకా॥

కీర్తన:—

పరమభక్త- వరదమదిని- గోరువాఁడఁ- గూర్మి నిలను-
గరుణతోడ- గావుమయ్య- శ్రీరామ- చంద్రనన్ను ॥పర॥
కరముదయా-కరుఁడవుధీ-వరుఁడనా-గుఁరుడవీవ- శరణంటి
పాదమంటి—శరణార్థిని— సాకుమయ్య ॥పర॥
తపియించితి- జపియించితి- విపదంబుధి-మునిఁగి యుంటి-
నుపమింతయు-నుపకృతిగన— నెప మేదియు- నెఱుఁగ కింత
॥పర॥

వదలియుంటి—జదవినినిజ—సుదతిజగము—మిథ్యయనుచు—
సదయరాము—పాదపద్మ—మెదను బెట్టి—యిచ్ఛవీడి ॥పర॥

రామచంద్రా! శ్రీరామ చంద్రా! దర్శనమీయవుగా! నాజన్మధన్యత జేయవుగా! నీదర్శనాభిలాషచే నేటడినపాట్లు నీమది కెక్కవుగా! ఇదినీకు సహజమే. నిన్నపేక్షించువారిని కల్యపరీక్ష జేయనిదే, లోకవిరక్తుల జేయనిదే. పంచేంద్రియద్వక్తి తప్పనిదే శరీరాపేక్షా దూరులఁజేయనిదే, తదేకనిష్ఠాగరిష్ఠులని దలఁచకయీప్సితార్థంబు జేకూర్పవుగా! నాశక్తివంచన లేక నీదు దర్శనోత్సాహినై, తదేక నిష్ఠా గరిష్ఠతజపించి, తపించి, స్మరించి, నిష్ఫలమన్నో వాంఛితుఁడనైన వాంఛితంబును సమకూర్పకోన, తమభక్తుండు, యాశ్వగాంశా సంభూతుండు, పవనతనూభవుండు, నాకుసాయము జేయు ననియెంచి యిచ్చటకు వచ్చితిని.

(శబ్దగుణిని నటభినయించి, తేరిపారఁజూచి సంతోష చిహ్నములతో)

నామనోరథంబీడేర్పుటకే కాబోలునిటవారిరాక.

ఉ॥ తెల్లనివెండ్రుకల్,వళులు,దేజముఁగొల్పెడిహేమదమ్మియున్।
తెల్లనివస్త్రమున్ గురుచదేహము నందుఁ నొంటిజందెమున్
జల్లఁగగర్రి మూఁగొని జయ్యనవచ్చెడి వృద్ధబ్రాహ్మణుం
డల్లదె కాంతి దెల్పిన మహాత్ముడె యీమహానియుడౌనకో॥

అల్ల యీరక్కసి జెప్పిన వృద్ధబ్రాహ్మణులు వీరైయుందురా! ఆహా! అంతపాటిపుణ్యమా! శ్రీ

రామచంద్రునకు నామీఁదనేటికిట్టి కరుణగల్గెనేమో!
ఏనాటికెవ్వని కెట్లు ఫలించునో యెవ్వఁడెఱుఁగు.

(వృద్ధ బ్రాహ్మణుఁడు ప్రవేశించును. తులసీదాసు
సాష్టాంగదండ ప్రణామంబు లాచరించును.)

వృద్ధ:— భవదభీష్టార్థసిద్ధిరస్తు.
తుల:— స్వామీ! తమ నివాస స్థలంబెయ్యది?

చం॥ చతురిమ మీదుచర్యలను చాలముదంబున విన్నవాఁడనే
నతులానరించువాఁడ సుగుణాలకు వన్నెపజూచిమీరు సం
తతమువసించు తావు దమనామముదెల్పి యనుగ్రహింపరే
( వృద్ధబ్రాహ్మణుఁడు వినుపించుకొనకయే పోవుచుండును.)
అతులిత భక్తిఁచనవు వర్మిలిగొంటి క్షమంచిపల్కరే॥
(వృద్ధబ్రాహ్మణుఁడు వినుపించు కొనకయేపోవును.)

తుల:— (తెల్లబోయి) ఇదేమిచిత్రము! తొంబదేండ్ల
తొక్కునకింత తొందరయేల! సవినయముగను భక్తి
శ్రద్ధలతోడను నేను విన్నవించు కొనుచున్నను నామాట
వినిపించు కొనకయే పోవుచుండెనే! ఈతఁడా రక్కసి
చెప్పినవృద్ధబ్రాహ్మణుఁడు కాఁడనియే తోఁచుచున్నది.
ఎట్లయినను పోయిపట్టెదగాక.

(అనిపోవును. పునఃప్రవేశము వృద్ధబ్రాహ్మణుని వెనుక
తులసీదాసు.)

తుల:— ఆర్యోత్తమా ! నాప్రార్థన నాలింపకయే
యెచటికిట్లు వడివడిగబోవు చుంటిరి?

వృ. బ్రా:— ఎచటికైన బోదును. నీకేల?

తుల:— మీనివాస స్థలంబెచట?

వృ. బ్రా:— ఆఁ! యెచట! సముద్రములో?

తుల:— నన్నచటికి దోకొందురా?

వృ. బ్రా:— సముద్రములో గలుపుటకా?

తుల:— ఎటులఁజేసినను సరే.

వృ. బ్రా:— నరహత్యలుజేయ నేర్పెదవా?

తుల:— మీరెచటనుందురో నేనునచటనే యుందును.

వృ. బ్రా:— నాకనులకొరుల పచ్చగిట్టను.

తుల:— మీరు బ్రాహ్మణులు అందులో వృద్ధులు. మీరొంటిగ నెట్లుందురు?

వృ. బ్రా:— నాగొడవ నీకేల. నాదారిని నన్ను బోనిమ్ము.

తుల:— నాకుపదేశంబు తమవలన పొందవలెనని కుతూహలము. నాకోర్కెదీర్పుఁడు.

వృ. బ్రా:— నా కుపదేశంబులు చేతగావు. కావలె నన్నయీపౌరాణికుని కడకుబొమ్ము. అంతి యేగాని వ్యర్థముగా నన్నుబట్టి దురవస్థల పాలు గాకుము. (పరుగు పరుగున బోవును. తులసీదాసు వెంటనంటి బోవును.)



## ద్వితీయ రంగము.

స్థలము:— కాశీనగర రాజవీధి.

(తులసీదాసు ప్రవేశము)

చేతిలో చేయివేసి పరువులిడువారి భంగి పోతినేగాని రెండడుగులు వేయనేలేదు. వానిమూర్తి గనుపించ లేదు. కారణమేమైయుండును. వారి యేమైయుండును. ఆవృద్ధ బ్రాహ్మణుం డీశ్వరాంశా సంభూతుండై యుండనోపు. ఛీ! నాయట్టిపాపి యెందైనఁ గలఁడా! కోరినఫలితము సంభవించినప్పుడను భవించకవిడుచువాఁడుండునా! వాయుతనూభవుని వెఱ్ఱిబ్రాహ్మణునిఁగాఁ దలంచి యెంతవెఱ్ఱినైతి.

### కీర్తన.

మోస—బోతిని— మొరడునైతిని ॥మో॥
ముక్తిప్రదాయిని — భక్తారత్నమును — భక్తితో డఁగొల్వ—
అ—శక్తి లేక నేను॥మో॥
రూప—ము—జూచినే —అపు — రూపమంచెంచక ।
నాపినాకోరిక — దీపింపకింతయు ॥మో॥
బ్రాహ్మణరూపుఁడు — పవనతనూజుఁడు
బ్రహ్మాండమునదాను—బరఁగ నెట్టులో ॥మో॥

ఆ మహానుభావుండు మహాభక్తుండగు హనుమంతుండుగాని బ్రాహ్మణుండుఁ గాఁడు. నేనిశ్చలబుద్ధితో వారికడ జేరి యెట్టియుక్కట్టులకైన బాల్పడి నాకర్జంబును దుద ముట్టించెదఁగాక.

మ॥ ముదమొప్పారఁగ వృద్ధబ్రాహ్మణుపదంబుల్ బట్టెదన్ దిట్టతన్
గుదురన్ గోర్కులఁ దీర్పుమంచు నెద నేమార్మిన్ దగన్ వేడెదన్।
బెదుకన్ ద్రొక్కినఁ జీల్చివైచినను దాఁజెండాడినన్ మోదినన్
పదముల్ బాయను రాముఁ జూపకను నా ప్రాణంబులున్నంతకున్॥

చం॥ తనువిలదాల్చినందులకు దాసుడనై హనుమంతుఁ గొల్చెదన్
ఘనకృపఁ జూపి నేని రఘునందను రామునిఁ జూచితీరదన్
జెవటిగలం విఘాతమును జెందిననిశ్చల భక్తితోడన
య్యనఘున కంజనిసుతున కర్పణఁ జేసెద నీశరీరమున్॥

(వృద్ధబ్రాహ్మణుఁడు ప్రవేశించును. తులసీదాసు మ్రొక్కి లేచి)

ఆర్యోత్తమా!

చం॥ సుగుణవతంస మ్రొక్కెదను జోద్యము దీవన లీయవేలకో
అగునగుఁ గానిరాత్రి యెటులాత్రత నేగితిరయ్య జెప్పరే।
నగుమొగమింక జూపకను నాయమె తీవ్రత గాంచ నాయెడన్
వగనిటు వేడుచుండ జనవాయు తనూభవుఁ డౌదు వేముకో॥

కీర్తన.

పవనతనయా—బలుకుమింత — వగను వేడా—బలుకవే
కోరినన్నే—గూర్మిఁ గొలువఁ — గోపగించఁగూడదయ్యా

పరుఁడగాను—బరుగులిడకు—బ్రాహ్మణోత్తమ—పాదముబడితి॥

(వృద్ధ బ్రాహ్మణుని పాదము బట్టును.)

వృ. బ్రా:- కీర్తన

వదలుము — వదలుము — పాదములు — బరువడిబోవలె
బ్రాహ్మణు నింటికి ॥వద॥

తుల:-

వదలను—వదలను—పాదములు—వరములొసంగక—బరఁగఁగను ॥

వృ. బ్రా:- ఉపదేశంబులు—యుండవిట-ఉపచారంబులు-నూడునిట

తుల:- స్వామీ! మీనిజరూపంబేల నాకడదాచెదరు. నిన్నటిరేయిక నుమరుగై యేమైతిరి. తాముమహా బల సమన్వితులరగు వాయు తనూభవులుగారే!

కీర్తన.

పల్ల॥ హనుమంతా! బలవంతా!

అ॥ ప॥ అనుచరుఁడను—నను—నాదరించుమా ॥హను॥

అనుదినమున—సద—యాత్మనిన్నుగని। వినుతి సేయుఁగను వేగమె
బోవలె॥

భక్తాగ్రేసర—భక్తవరద నా—శక్తిమించినను—జాలఁగొల్చెదను
రామభక్తుడవు—రామదూతవు-రామ నామ యుత — రయమున
బ్రోవలె

సరసమె నేనిటు—సరసఁజేరఁగను।విరసతఁజూపక విసరిగొట్టకు॥
కొట్టినఁదిట్టినఁ-గోపగించినను-మట్టు బెట్టినను మానను-నినుఁగన

స్వామీ! మీ పాదారవిందములకు మ్రొక్కు-వాఁడ నన్ను దయతోఁ జేకొనుఁడు.

వృ. బ్రా:- కీర్తన.

బాలకా - బాలకా - పరిపాలించెదవు - పాపభంజనివని ॥బా॥
నేరమా - భారమా - గారాబంబున - కరుణనుబల్కుట ॥బా॥
దొంగవా - లొంగవా - ఆ - లింగనఁజేయుదు - వనుసరించెదవు ॥బా॥
వృద్ధుఁడనే - వ్యర్థుఁడనే । శ్రద్ధతోడనిట - సాగిలపడియెను ॥బా॥

తుల:-

ఆర్యోత్తమా! ఏల యీ అకారణ కోపము! అనుగ్రహింపుఁడు.

- కీర్తన -

అయ్యా! కను — మయ్యా! విను — మయ్యా నను — నాదరించు ॥మయ్యా॥
ఎచటకేగువారు — తా — మెచటనుండువారు — అచటకునను
దోడ్కొనెదర — ఆతురతనే మిమ్ముగొల్చెద ॥య్యా॥

వృ. బ్రా:-

అనుజా — ఓమనుజా — రామ — తనూజా — నామాట
వినుము — ఇచటకు — బహుదూరము — నాయిరువుగన
భారము — అటునిటు నే — నెటులో బోయి — నొంటిన
చటనుండువాఁడ ॥ అనుజా ॥

తుల:- భక్తవరదులంచు — మిమ్ము — భజనజేయనెంచ? నా — శక్తి
యుండవలదటంచు — జరిగిపోవ — న్యాయమెటుల ॥ నయ్యా ॥

వృ. బ్రా:-

ఉపదేశముజేయ — యా — యుపమయింతయు నెఱుంగ
నుపకారుఁడు — పౌరాణికుఁ — డిచ్చునుపమదలిఁచి
కొమ్ము పొమ్ము ॥ అనుజా ॥

తుల:-

యెటులబోతిరయ్యా— నా కెఱుఁగఁ జెప్పుఁడయ్యా!
ఇచ్చుబుట్టెనాకు—మీ—ముచ్చటవిన నెంతో ॥అయ్యా॥

వృ. బ్రా:-

ఎటులబోవనీకేమి—ఆటులనడుగఁ బనియేమి?
పటుతరముగ బాధించెదు—పట్టపగటి దొంగవలె ॥అను॥

తుల:- స్వామీ! నామది మీసాన్నిధ్యము జేరిమిమ్ము గొల్చి సేవఁ జేయుమని మరిమరింబురి కొల్పుచున్నది. కరుణించి యుంపులకంగీకరించ బ్రార్థితులు.

వృ. బ్రా:- నేనేమో నొక మహానుభావుఁడనని యెంచి యేలనన్నుగొల్చి హాస్యాస్పదుఁడ వయ్యెదు. నేవృద్ధుఁడను. వ్యర్థుఁడను. సామర్థ్యలేకడ కేగినీయాప్సి తమును సమకూర్పుకొమ్ము. బొమ్ము.

(అని పోవును తులసీదాసు అడ్డమురాగా)

వృ. బ్రా:-

పల్లవి॥ ఓరిసిచ — చేటువమ్ము! దారివీడిపోగదే।
అ॥ ప॥ సోగుయెత్తి — తేని వాడు। బారమండిబాయవు।ఓరిసిచ॥
చర॥ ముసలివాఁడు— మెదలలేఁడు —విసిగియేమి—జేయుదు।
వసన బ్రాగి — బలుకఁబోకు — పసనుమాల్చి- బారుదున్।
పవనపుత్రుఁ—డనుచు నన్నుఁ — గనఁబోకు ఘాతుకా
గపయరాకు — గపయరాకు — యసపరంబె- యాగుమా॥
కసరినిమ్ము—విసరివైతు—పసనుమాల్చి— బారుదున్

ముసలివాఁడ — ముసలలేకు — విసువుపాకు — వీడుమా॥
తులసీదాస — తొలఁగుదారి — కలకఁజెందఁ — జేతును।
ఫలము లేదు — పదము వీడు। యిలను బ్రదుకు — నిచ్చలున్
వయసు దీరి — వణకుచుండ — బయులు బట్టవచ్చెదు।
నియమమింత — పెదనుగాంచు — బయలఁగాంచు — కాలకా।

(తులసీదాసు పైనజూచుచు వృద్ధబ్రాహ్మణుఁడు పోవును)

తుల:— ఎంతగంభీరవాక్యము. ఎంతటి మాయదారి తనము. ఎంతపరీక్ష. భక్తులు కావలెనన్న ఈశ్వర మయమగు నిచ్చగలుఁగవలెనన్న నోకులనుదిగర గించవలెనన్న దాముబట్టిన పూనిక నెఱవేరవ లెనన్న ఎంతటివిచిత్రవిషాద విసర్జన విక్రృతికర్జం బులకైన లోఁబడి తెలపడిపూనిక పూర్ణముగ సా ధింపవలెను. లేదా అంతమొందవలెను. ఎట్టు లైన శ్రీమదాంజనేయుని ప్రసన్నునిఁగఁ జేసికొని మదీయ మనోరథము నెఱవేర్చుకొనియెదఁగాక. వెంటనంటి పోయెదఁగాక. (పోవును.)



## తృతీయ రంగము.

స్థలాంతరము:— కాశీనగర రాజవీధి

(తులసీదాసు విషాదముతో ప్రవేశించును.)

**తుల:—** రామ! రామ! నే నెంతటిపాపిని. అట్లు కాకున్న యెంత వేడినను నీన నిజ స్వభావము నిను మంతయు నెఱింగింప వేడినను సుంతైన గ్రహించుట కెడమీయఁడాయె. ఇదినా ప్రారబ్ధమా? లేక నాభక్తమందారుఁడు దర్శన మొసఁగ నిచ్ఛగింపఁడా! ఇచ్ఛగింపకున్న నాయిచ్ఛదీరు టెట్లు? తీరకుండునా? నేబట్టినది చింతకొమ్మ గాదా! మునుగకొమ్మయా విఱుఁగుటకు? (విచారించి) అవును నాకొక్క యుపాయము స్ఫురించుచున్నది. శ్రీయాంజనేయుని దయను గనవలెనన్న శ్రీరామమూర్తి నామస్మరణఁ జేసిన తప్పక దయగొనవచ్చును. నామహానుభావుండు శ్రీరామస్మరణ మెచట జేయఁబడునో నచటకు తప్పక వేంచేయును. కావున నే శ్రీరామస్మరణ జేయుదును.

### కీర్తన

శ్రీరామచంద్ర కృపాళుభజమన హరణ భవభయ దారుణ
నవకంజలోచన కంజముఖ కరకంజ పదకంజారుణం।

కందర్ప అగణిత అమితచభినవ నీలనీరదసుందరం
పటపీతమానోతడి తరుచిశుచి నౌమిజనకసుతాభరం॥
(వినుచు వృద్ధబ్రాహ్మణుఁడు రాగా తులసీదాసు తటాలున నమస్కరించును.)

వృ. బ్రా:- (కనువిచ్చిచూచి) నీవానాయనా! శ్రీరామనామ స్మరణఁ జేయుచున్నది.

తుల:- అవును తాతగారు. మీరేలయట్లు కండ్లుమూసికొని చెప్పులునిక్కబెట్టుకొని దారితెన్నులేక శబ్దము నవ్వడిబడి వచ్చుచుంటిరి.

వృ. బ్రా:- ఎవ్వరో భక్తులు రామనామస్మరణ జేయుచున్నారని వినవచ్చితిగాని, నీవంటిదారి గొట్టుదొంగలిట్లు చేయుచున్నారని దలంపనైతి.

తుల:- శ్రీరామచంద్ర శబ్దమును వినినయొక్క వారు మంతునకుఁ దక్క తక్కిన వారికింత యానంద ముండదు. మీరా యాంజనేయులుగారుగదా!

వృ.బ్రా:- ఒరీమస్టా (కోపములో) యెంతటివాఁడవురా! నన్నొక్క కోఁతిఁ జేసి యాడింప నూహించితి విగా! నాతో నానీకు హాస్యము!

తుల:- ఆర్యా! తమకేలయింత యాగ్రహము. కపికుల శ్రేష్ఠులంటినేగాని వేఱుగఁ బల్కలేదే.

వృ. బ్రా:- ఛీ! మూర్ఖా దూరంబుగఁజనుము. అట్టుచన కున్నజూడుము యేమి చేసెదనో. (బెదరించును.)

కీర్తన

తుల:-

తెలిసెను—దెలిసెను— బో—తమ తాత్పర్యము॥ తె॥
దూరముబోయిన— మీరు మాయముగ।
సారకు జేరఁగ— సంశయం ముండున॥
గొల్లవాఁడనె— గుణము దెలిసెఁబో — గురిజూపితిరి
గోప్యంబుగమునె॥
కదలను—వదలను—వదలను—నిముసము — ముదమారగ
మీపదము—విడువను॥

(మఱింత దగ్గరగాబోయి)

తమవిషయమై నాతోకింత దెల్పరుగా?

వృ. బ్రా:- (విసువుతో) ఓహో! ఇది మంచితగులాటము గానున్నదే! నాప్రాణంబులకు విసువు జనించుచున్నది. ఈదుర్మార్గుండెక్కడనుంచి దాపరించెనో! ఛీ! ఛండాలా! దూరంబుగఁబొమ్ము.

(తప్పి బోవును)

తుల:- (వెంటఁజని అడ్డముగా బోయి) స్వామీ! ఆగ్రహింపకుము. అనుగ్రహింపుఁడు మీవంటివారింత జాలిలేక కోపగించుట గోరి మిమ్ము గొల్వవచ్చిన వారి ఘోరమా! నేరమా! కాకున్న! మీనుస్వభావంబు మరుగిడం జేయుటకా!

వృ. బ్రా:- (కోపముతో) ఓరీదుష్టాత్మా! నీపనిమీఁద నీవుండక నావంటి ముదుసలితో నెక్కసక్కెము

లాడెద వేలరా! భళిరా! నీకు నే నా యిచ్ఛకము
లాడుటకు దొరకినది. అధికప్రసంగము మాని
పొమ్ము.

తుల:- స్వామీ! మీరెంత జెప్పినను యే మనినను
మిమ్ము వీడిపోవ నా మనంబొప్పకున్నది. మీరు
కొట్టినను తిట్టినను దూషించినను మీపాద సేవ
మానజాల. అది లేకున్న నేమన జాల.

వృ. భా:-(జాలితో) ఓరీ! నీవు మహామూర్ఖునివలె గన్పించు
చున్నావు. నన్ను మాట్లాడించకుండ నుండుము.
మాట్లాడించితి వేని చెంపలు బ్రద్దలు కొట్టెద
సుమా.

(అని మౌనముదాల్చును) (తులసీదాసుదగ్గరకుబోయి)

తుల:- స్వామీ! తమ్ము నమ్మి తమయనుగ్రహమును
సంపాదించుకొన వచ్చినవాని మీఁద నింత
యాగ్రహ మేల?

కీర్తన

ఏటికి- తమకింత- కో పము- పరి—తాపము ॥
సుస్వభావము దాప- స్వభావమది దోప—ఆపవన సూనుడ
మీవను తెల్పదో॥ ఏటిః
పవనసూనులుగారె! పవనాత్మజులుగారె! కారే రాములసీతా
కల్పిన దాసులు
కాంక్షించి గోరితి- రక్షించు మారుతి - భక్షించ రక్షించ
భారము మీయదే॥

వృ. బ్రా:— ఏమేమి! నీవునాకు భక్తుఁడవా! అందుకా నన్ను కోఁతిఁ జేసితివి. సెబాస్! నీదిరాశక్తి. ఛీ! ఛండాలా! దూరముగా బొమ్ము.

(అనికొట్టఁబోవును.)

తుల:— స్వామీ మీరిట్లు అపార్థము చేసెద రేల.

కీర్తన.

తెలసితి తెలసితి లే హనుమా॥
వానర శ్రేష్ఠమ వరగుణధామా॥ తె॥
వావియొకాదన వాయుసుపుత్రా ॥ తె॥

స్వామీ! నాపలుకుల యందపార్థమేమున్నది? మిమ్ముల వానర శ్రేష్ఠుఁడవంటినిగాని వానర మంటినా! ఉన్నమాటకు తామసమేల? మీమాయలఁ దెలసితినని మాయ శేయఁబూనితిరి గాఁబోలును. అద్దాన లాభ మేమిక ద్దు. భగవద్దర్శనంబుకై ద్వాదశ వర్షంబులు పడరాని యిడుమలఁబడి ప్రయత్న విఫలతఁజేసి తమ శిష్యుండనై భగవద్దర్శనముచే కృతార్థుండ నగుదు నని గాఢవిశ్వాసముచే మీశరణుజొచ్చితి. తమకంటె వేరుదిక్కు లేదు. పాలముంచినను నీటముంచినను మీదే భారము. తమయిచ్ఛ వచ్చినట్లు జేయ వచ్చును.

(అని పాదములపైఁబడును.)

—కీర్తన.—

వృ. బ్రా:—

ఛీ! తులువ—తులువ—పలుచదనమిటు విడి పో పో పోరా

చలము సెలుఁగ వేరా — బలముగనుమిదేరా।
బలుకకిదే - బలమణఁచెద — గలఁతఁబడఁగ బోలియించెద ॥ఛీ॥
తులసికిదియ రాకు — కలఁతఁబడయఁజేతు। తోలఁగుమిదే —
తోలిబలుకులు — యిలను విడచి - విలపించెదు ॥ఛీ॥

కీర్తన.

తుల:—

హా! పవనతనయా—పరమపురుష—పతితుఁడఁ బ్రోవన్ రారా।
పదము విడువ స్వామి। వదలవదల స్వామి। కదలనుమీ ।
పదములవిడి— సదయహృదయ—ఆదరించిన ।
పటుతర మనలోకు - కిటుకు దెలుపునాకు। నటకుఁడవే
నిటు బలుకఁగ—మటుమాయము ॥హా॥

వృ. బ్రా:— ఓరీదుష్టాత్మా!

ఉ॥ మానగదయ్య యట్టియవమానపు చేష్టల నెట్టివేళలన్
మీనులఁ బెట్టవింతయును వేడఁగవల్దని నొక్కి చెప్పినన్।
గానవు నిస్థితిన్ మదివికావికలై జరియింపవేడు దే।
"దానవు"శబ్దమున్ వినుఁధన్యత జెందెదు ధైర్యమూనుమీ ॥

రామా! రామా!

(విషాదము నభినయించి యూరకొనును.)

తుల:—

కం॥ మానోట విప్రుఁడు వచ్చిన ।
శ్రీనామామృతము గ్రోల శ్రీరాముని నే
కానఁగ నిస్థితిగలెను ।
కావున శ్రీరాముఁడాపి కాపాడరుగా ॥

ఈ బీదవాని యందు కనికరముంచి, కటా
క్షించి శ్రీరామసందర్శనంబు చేయించి సంతసంబు నొ

దింపుఁడు. ఈజన్మయున్నంత కాలము మిమ్ములనత్యంత భక్తితో మీపాదసేవఁ జేయుచు, అసువులదొసఁగువాఁడఁ గాని, మిమ్ములమాత్రము వీడువాఁడఁగాను. సత్యము. సత్యము. సత్యము.

ఉ॥ సత్యము సత్యమే గనుఁడు స్వామిని జూపుఁడు జూపకున్న నే
నిత్యము మిమ్ముఁ గొల్చి కడు నేర్పున గాలము బుచ్చియుద్ధరన్
మృత్యువు చేతఁ జిక్కఁ దను, ముక్తికి సాధకుఁడైన రామునిన్
నిత్యు, నిరామయున్, గనుల నేర్పున జూపక మిమ్ము వీడగా.

వృ॥ బ్రా:— నాయనా! తులసీదాసా!

ఉ॥ వందనమైన జేయుమను బల్కక యూరక సావధానతన్
గందకకుంధకన్ వినుము గాంక్ష పురాణము భక్తితోడుతన్
ముందుముముక్షుతారకము మోదముతో వినుచుండుమింపుతో
సందియ మంతవీడుమిఁక జాలఁ బ్రసంగము నోరుమూయుమా॥

ముందుపురాణ శ్రవణము జేయుదమురమ్ము. తదుపరిమాటలాడుకొనవచ్చును.

తుల:- స్వామీ! మీకువందనము జేతు. నా సంశయ మొండుదీర్పుఁడు. రామాయణమునకు మీరే ముఖ్యకారకులుగదా! ఇతరులు జెప్పగా వినుకుతూహలము మీకేలనో దెలియజెప్పుఁడు.. మీరేది చెప్పక బోయినను సదొక్కటి మాత్రము దెల్పుఁడు.

వృ. బ్రా:— (ఆశ్చర్యముతో) నేనొక రహస్యపు మనుజుండనా! అద్దానినీవు గుర్తించితివా! చాలు

జాలు. ఇంకనైననిట్టి మాటలఁ గట్టిపెట్టుము. నోటికివచ్చినట్లు వదరకుము. ఎవ్వరైన విన్న నేమనుకొందురు. మాయదారియనరా! బంధింపరా! విడుతురా! నాజోలికింక రాకుము. వచ్చితివా చచ్చితి వనుకొమ్ము. (కండ్లురిమిజూచి తులసీదాసునిఝడిపించును. తులసీదాసు సాష్టాంగము పడవృద్ధ బ్రాహ్మణుఁడు పరుగు పరుగున బోవును)

తులసి:— (తులసీదాసు దిగ్గనలేచి వృద్ధ బ్రాహ్మణుని గానక) పోయెను. నేనిదే వెంటాడించెద.

(పరువెత్తిబోవును.)



## చతుర్థరంగము.

స్థలము:— కాశీనగర రాజబాట.

(వృద్ధబ్రాహ్మణుఁడు ప్రవేశము.)

ఈబాలకుఁ డెవ్వఁడై యుండనోపు. నేను హనుమంతుఁడనని గట్టినమ్మకము గలిగి యున్నవాఁడు. వాఁడట్లుగ నూహించి యుండునా! లేక యేఱి వల్లనైన నెఱింగి యుండునా? ఎట్లయినను దృఢ భక్తి విశ్వాసములుగలిగియున్నాఁడు. లోకులు నాగుట్టు తెలియుదురేమోయను భీతిచే నేనెంతసామదాన భేదోపాయములచే నొక్కి చెప్పినను వినుపించుకొనఁడు. తనదారితనదేగానినామాటఁ జెవిఁబెట్టఁడు. భక్తివిశ్వాసము లన్నిట్టివేగదా? ఇంతటితో మనుజునిపరీక్షించుటజాలదు. ఇత్తఱికఠిన దండనమునఁ గానివీనిశక్తిభక్తులఁ బరీక్షింపవీలులేదు. రామాయణ కాలక్షేపమునకు గాలమతిక్రమించుచున్నది. పోయెదను.

(పోవుచుండును. వెనుకననుసరించి తులసీదాసు ప్రవేశించును.)

తుల:— శ్రీ ఆంజనేయా! పవన తనయా! భక్తరత్నమా! శ్రీరామదూతా! నా మొఱాలించవుగా! నన్నుఁగాపాడవుగా!

కీర్తన. ఆనందభైరవి. ఆదితాళము

ప॥ సమీరవరతనయా-నీ-సమానమే-కనులనిన్నుగనుఁగొన ॥స॥

అనుప॥ సమానమెవరు పవమానసుత వి। క్రమాటోపభా -
సమాన విధివగు ॥స॥

చ॥ తరంబెవరికగు-కరంబుబోఁడగన - స్థిరంబె కతలను - స్మరించి
బోఁగడఁగ।

చిరంచెదవుయిల-భరింప నెటులగుఁ-గరంబొదవు -అబ్బు-
రంబుఁగనఁగను ॥స॥

మునులంతటివారు నీమూర్తివంతను జూడలేక తపోవనసంచారులై తిరుగుచుండ నేనెంతటివాఁడను. నీనామ సంకీర్తనజేయుచు నినుఁగన యత్నించెద.

(వృద్ధ బ్రాహ్మణుని కడకేగి)

తుల:— హనుమా-నే-భరమా-నా-శరమా-నిన్ బొగడుటకును
స్థిరముగ-నిను-రాముదక్క-మరియేరిని-మదినిదలుప
॥హ॥

వృ. బ్రా:— ఓరీ! తిరిగి నేహనుమంతుండనని వదరుచుంటివిగా?

తుల:- హనుమా-నను-గొనుమా-కడు-ఘనమా- అనిలాత్మజాండ
కనుమా-కరు-ణించుమా-పరుఁడనంచుఁ-దలుపకుమా॥హ॥

వృ. బ్రా:- నీవుపరుఁడవుగాక మరెవ్వఁడవు. దారులఁగొట్టుదొంగవు.

తుల:- కనఁగా-నే-వినఁగా-ఇటు-చనఁగా-ఘను-రాముఁజూప।
అనిలాత్మజుఁడే - ఘనున్ - గనులఁజూపఁ గలబలుండు
॥హ॥

వృ. బ్రా:— అవును. అట్టి ఆంజనేయుని కడకు బొమ్ము.

తుల:— శరణా-యఘ-వారణా-భవతరణా-రుండవంచు—భవ।
చ్ఛరణం — బులుబట్టినాఁడ - గొలుచువాఁడ ॥వా॥

(పాదములు బట్టును.)

వృ. బ్రా:— నాకిదేమి తగులాటము గల్గినది. రామాయణకథా శ్రవణమునకుఁ బోవు వానిని బట్టి బంధించెద వేలరా!

తుల:— పరువా-యిది-తెరువా-నే-బరువా-పరు-తావుఁ జూప।
కరువా-వర-భక్తులింక-శంక లేక-శరణుటివ ॥వా॥

వృ. బ్రా:— బాలకా! లెమ్ము! నీకు కావలయున దెద్ది.

తుల:— కనుమా-నను-వినుమా-యిఁక।జనుమా-శ్రీరామకనుల।
కనుపిం-పుము-శ్రీరాముని-కరుణజూపు-మాంజనేయ
॥వా॥

వృ. బ్రా:— నీవునన్నిట్లు బాధించి బొందునది కడగండ్లఁ గాని శ్రీరామ మూర్తినిగాదు. కాన నామాట వినుము. అట్టి యాశలు మానుము. మానకుంటివేని నీపాట్లు చూచుకొమ్ము.

తుల:— శ్రీరామాంత రంగిక భక్తవరదా! నానిశ్చయము వినుము.

చం॥ విసిగిన, జీదరించినను, వేగమెనన్గని దిట్టి కొట్టినన్।
గసరిన, బొమ్ము బొమ్మనుచు గష్టదశన్ ననుఁ జేర్పఁ జూచినన్
గసిమసి జేసి దేహమును ఘాతమొనర్చిన జెండి వేసినన్
బసతనమంచు నెంచెదను; బావని! నిన్ గొనియాడుచుండెదన్॥

మహానుభావా! ఇప్పుడైన నామనోనిశ్చయం బెఱింగితిరే. ఏలయిట్లూరక పలిచెదరు. మీ రలిగిన శాంతింపఁ జేయుటకు నేనెంత వాఁడను.

చం॥ పరమతబోధనల్ దెలియుబాల్యడ సేరరు మీమహత్త్వముల్
పరమదయాకరుల్ తమర భక్తులపాలిటి కల్పవృక్షముల్
గుఱుతుగ మీకృపారసము గూర్మినిజల్లర రాముఁజూపరే!
తరమె జరింపరామవిభు దర్శన సన్నుతు లబ్బకుండినన్॥

స్వామీ! మీనిర్హేతుక జాయమాన కరుణా కటాక్షమునగాని ప్రయత్నపూర్వకంబుగ మిమ్ముదర్శింప హరిహర బ్రహ్మాదులకైన నలవియగునే. అట్టి వారికే యలంఘ్యమైన నావంటివానికగునా! కానిమీ అనుగ్రహ పాత్రులగువారు తమరు దయాళురని బహువిధ ములఁ బొగడుచుండిరి. అట్టి తమమృదు హృదయార విందము నాయెడనిట్లు శిలాకృతిం గాంచుటఁ జూడనా పూర్వజన్మార్జిత కర్మఫలము పొదలఁ జెద. అట్లుగాకున్న యిన్నివిధంబుల దీనాలాపంబుల మొఱలిడుచుండ మీ మనం బిసుమంతేయుఁ గరఁగకుండునా! నాయపరాధ శతంబుల క్షమించి భవసాగరమునుండి యుద్ధరించి, రక్షించి, కటాక్షించి, శ్రీరామసందర్శనంబు చేయుం పుఁడు. (పాదముల మీఁదఁబడును.)

వృ. బ్రా:— (ఉలికిపడి) కార్యమునిమించుచున్నదే! ఇన్ని దినంబుల వలెతప్పించు కొనుటకు వీలుదప్పి నట్లున్నదే!

(యోచించి) ఓరిబుద్ధిహీనుఁడా! పిశాచమువలె బాధించుచుంటివే! శ్రీరామమూర్తి వైకుంఠమున నున్నారు. వారియందు నీకంత భక్తిముదిరనేని అక్కడకు బోయి చూడుము. ఉన్నతావున నే నెట్లుదర్శనము దొరకును. నీచిత్తము ముదిరి నెత్తికెక్కినది. ఈరోగము సామాన్యముగా కుదురదు. ఎన్నిసారులు వలదన్నను మీఁద మీఁదకువచ్చి దుర్వివాదము జేయుచుంటివి. ఇది పాడిగాదు. నాయెదుటనుండిబొమ్ము. పోకుంటివా యేమగునో జూచుకొమ్ము. (బెదరించును)

తుల:- స్వామీ! తాముకటాక్షించి నాకాచార్యులరైయుండు రేని పరమ పదమునకుఁబోయి వైకుంఠవాసునిదర్శనము జేయుట దుర్లభము కాదు. శతయోజన విస్తీర్ణముగల జలార్ణవంబు దాటుట పిల్ల కాల్వల దాటుట కాలేదా! హిమాచలాది దుర్గంబులు నిర్గమించుట అపర్గళము కాలేదా? సంజీవిపర్వతంబున పూలచెండ్లరీతి నాడించ లేదా? అట్టి వీరాధివీరు నాశ్రయించిన జేయరాని దేది యుండును. (సంతోషముతో గంతులిడును.)

కీర్తన.

వృ. బ్రా:-

తృప్తిపడకు మోరి — సి — తృష్ణ పడకు నోరి ।

శాంతముగను వారి — ని — సాహసమిఁక జాలునోరి
జడబుద్ధులంచకలు — ని — నడతలు బుడబుడలు॥

నీజాలవిద్యలచే పిచ్చిచేష్టలఁజూపిన సంతోషించు వాఁడనుగాను. పోపొమ్ము. పోకుంటివా నీప్రాణంబులు నీవికావు. నేమడుసలిననియిట్లు జేయుచుంటివిగా బోలును. నీతలతిక్క నొక్కనిమేషంబున వదలించెదఁ జూడుము.
(కొట్టబోవును)

తుల:- (మతింత సంతోషమున గంతులువేయుచు) ఆహాహా! స్వామి! మీరునాప్రాణంబులఁ బుచ్చుకొనినను సరే. మిమ్ముమాత్రము వదలను. కదలను. బెదరను. దయామయులైనమీరు పెక్కు దినంబులనుండి దిక్కుమాలిన పక్షినగు నన్నిట్లు త్రిప్పల బెట్టుచుంటిరి. కృపాకటాక్షములతో వీక్షించిరక్షించక యుపేక్షించుట యుక్తమా? పిచ్చుకపై బ్రహ్మాస్త్రము వేయుదురే! యిట్లు చలమూన బాడియే! దాసుని నేరములు క్షమించి రక్షింపవేఁడువాఁడ (దోసిలొగ్గి)

కీర్తన

ప॥ హనుమంతా! బలవంతా॥
అను॥ ప॥ అనుచరుఁడను — నను — నాదరించుమా ॥వ॥
అనుదినమున — సద — యాత్మనిన్నుఁగని — వినుతిసేయఁగను —
వేగమె బ్రోవుమి ॥హను॥
భక్తాగ్రేసర — భక్తవరదవా! శక్తిమించి ని — సరసఁ జేరితిని ॥హ॥

రామభక్తుఁడవు శ్రీ-రామబంటువు— రామమూర్తి నిట-రయ
మునఁజూపుము ॥హ॥
సరసమె చేసిటు-సరసఁజేరఁగను - విరసతఁజూపుచు-విసరి
గొట్టెద వె ॥హను॥
కొట్టినఁ దిట్టినఁ-గోపగించినను-మట్టుబెట్టినను-మానను నినుఁ
గన ॥హ॥

స్వామీ! మీ ప్రచండప్రతాపప్రభావంబుల వర్ణింప నేనెంతవాఁడ. మీరూప సందర్శనంబులు సజ్జనుల కెంత సంధాయకంబో దుర్జనులకంత దుఃఖకరంబు. మీసుస్వరూప సందర్శనంబు సంతోషదాయకంబు. మీకళ్యాణగుణంబులు వర్ణనాతీతంబులు. దుష్టశిక్షకుండవు. శిష్టపరిపాలనాధ్యక్షుఁడవు. నీనామోచ్చాటనంబు జేసిన సకల భయనివారణంబు. సమస్తసంపత్కరంబు. లోకరక్షణార్థంబు యీశ్వరాంశ సంభూతుండవై జన్మించితివి. నీ ముష్టిఘాత గరిష్టతే నాదశకంఠుఁడెఱుంగు. నీభుజబల ప్రతాపంబు నాదేవపాలితంబగు సంజీవి పర్వతంబెఱుంగు. మీయవక్రమపరాక్రమవిక్రమంబులంకాపురంబెఱుంగు. నీబుద్ధికుశలతయా భానుఁడెఱుంగు. నీవినయవిధేయతలా శ్రీరామచంద్రుఁడెఱుంగు. నీవో సత్యసంధుండవు. నిర్మల జ్ఞాన పరిపూర్ణుండవు. సదాచార నిరతుండవు. రామకార్య ధురంధరుండవు. నిన్నునమ్మినవారికి నాశనము లేదు.

(సాష్టాంగపడును).

వృ. బ్రా:- (వికటముందహాసంబున) ఓహో! నీకు భక్తి ముదిరినది. ఇట్టిభక్తినేనెన్నఁడెఱుంగ. అంతకంతకు జ్ఞానమావరించి ఆకసము ముట్టుచున్నది. ఓహో? నీ వేషముజూడఁజూడ నాపాఁడభూతివలె గన్పించుచున్నావు. ఇక నీ వేషము జాలింపుము. ఇంతటితో నోరుమెదపక యూరకుండుము. లేకున్న తగిన శాస్తి చేయించకమానను.

(చివాలున లేచి పరువెత్తి తులసీదాసు నడ్డముబోవ)

కీర్తన

వృ. బ్రా:- కండక్రొవ్వినా కాయమువదలు! అండనుండిన-అతురతపడఁగా! గుండెల్వ-చీల్తున్—ఖలా॥

తుల:- వేగన్

వృ. బ్రా:- కండన్

తుల:- పరమనియమపవనసుతుఁడ వే-ధరనునిటులఁ-బలుకఁ-దలచెదే।

వృ. బ్రా:- అహా! మానంబోవుగా!

తుల:- మానన్

వృ. బ్రా:- కండక్రొవ్వి-

తుల:- శ్రీరాముని నా-కన్నులగనగా-సరసతఁజూఁపగదే

వృ. బ్రా:- దౌర్జన్యమా నీకు॥ కండ -

( చివాలున బరుగెత్తును )

తుల:— (అటునిటు జూచి వృద్ధబ్రాహ్మణుని గానక)

ఆహా! నేఁడును నాకు మేలుకోట నామమును బెట్ట దలచినారు కాఁబోలు. (పరికించి) అల్లదుగో

పౌరాణికుని యింటివైపునకే పోవుచున్నారు. పోయి పట్టెదగాక.

(పరుగెత్తి పోవును.)

(ప్రవేశము ఒక సభికుఁడు. ఎడమచేతి మణికట్టును కుడిచేత గట్టిగా బట్టుకొని)

ఈనిర్భాగ్యపు ముసలి ముండకొడు కెక్కడ దాపరించినాఁడురా! శ్రీరామచంద్రా! అయ్యో! రామ! రామ! ఈబాధ నేనుసైరింపఁజాలనురా! మనుష్యులు కూర్చుని యున్నారనియైనా జ్ఞానములేదు కాఁబోలు. గ్రుడ్డివానివలె త్రొక్కుకొనియే పోవుచున్నాడు. అబ్బా! నా మణికట్టు విఱిగిపోయినట్లున్నది. (దృష్టిసారించి.) అదేమి! యింకను భీభత్సముగానే యున్నదే! పురాణ మాపివేసిరి కాఁబోలు. ఈ అల్లరి యేమి? ఏమైననా కేమి? (పోవును.)

(ప్రవేశము మఱియొక సభికుఁడు కుడికన్ను ఉత్తరీయాంచలమున నద్దుకొనుచు) ఈ ముసలి ముక్కలుగాను. వీనికీ క్రోధమెందుకు? పాపమా బాలుఁడేమియుచేయ లేదే! అబ్బా! అబ్బా! ఈ కన్నింకను నీరుగారుచునే యున్నది. ప్రతిదినమును వీనిజూచి వీని యంత మంచి వాఁడింకొకఁడు లేఁడని తలచెడి వాఁడను. ఔరా! పాపము వీరెవ్వరో కుంటుచు వచ్చుచున్నారే?

(ప్రవేశము మఱియొక సభికుఁడు కుంటుచు)
నారాయణ! నారాయణ!

మొదటి సభికుఁడు:— ఏమిబాబూ! కుంటు చున్నారు!

రెం॥ స॥:— ఏమున్నది నాయనా! చేసినదానికి ఫలమను భవింపక తీరదుగదా! ఆచిన్న వాఁడేదో కోరు చున్నాఁడు. ఆముసలి వాఁడది యీయనను చున్నాఁడు. పురాణ శ్రవణమున నల్లరి జరుగు చున్నదని పౌరాణికుఁడు వారిని బైటికి వెళ్ల గొట్టుమని నాకాజ్ఞాపించెను. నేనువానిని బైటికి త్రోయనెంచితిని గాని, ఔరా! వానిబల మేమి చెప్పుదును? వెళ్లినందుకు నాకు తగిన శాస్తి చేసినాఁడు. నాయొడలంతయుహూనమైపోయినది. వాని తన్నువలన నాయీకాలు విఱిగి పోయినది. దైవమా! హా! నేనెంత పాపముచేసితిని. అబ్బా!

మొ॥ స॥:— (కన్ను నద్దికొనుచు) రామ రామా! ఆచిన్న వానిని జూచుడు. వీనికెంత కోపమున్నదో వాని కంత పట్టుదల యున్నది. తన అంగవస్త్రమున నాముసలివాని రెక్కల నెట్లు కట్టి వేసినాఁడో చూడుఁడు. ఎంత విదల్చి వేయుచున్నను తన పట్టును విడుచుటలేదు. ఔరా! ముప్పదేండ్ల యువకుని నెట్లు గిరగిర ద్రిప్పివేయు చున్నాఁడో చూడుడు.

రం॥ స॥:-- ఇంకను చూచుట కేమున్నది. అదుగో! మనదెసకే యిటు వచ్చుచున్నాఁడు. మనమిక్కడ నుండి పోయినగాని మన ప్రాణములు దక్కవు.

( నిష్క్రమింతురు )

(ముసలివాఁడు తన రెక్కలు రెంటిని అంగవస్త్రముచే గట్టబడి తులసీదాసు బట్టుకొన భీకరాకారంబున గిరగిర ద్రిప్పుచువచ్చును)

కీర్తన.

వృ. బ్రా:——విడువరా!

తుల:—— విడువను.

వృ. బ్రా:— కడు నిడుమల బడబోకురా॥ ॥విడువరా॥

తుల:- కడు నిడుమల బడబోనుగా॥ విడువను॥

వృ. బ్రా:—— ఒడలు చీల్చెదను- కడు దౌష్ట్యంబున ॥విడువరా॥

తుల:— ఒడయుడ వౌటను - వొప్పదు నయ్యా ॥విడువను॥

వృ. బ్రా:-- కండ కండలుగ - గాయము జీల్చెద ॥విడువరా॥

తుల:— వండ యుండుగద - నాత్మకికడవె ॥విడువను॥

వృ. బ్రా:—విడువరా!

తుల:— విడువను —　(గిరగిర ద్రిప్పుచుఁ బోవును.)

(ప్రవేశము పౌరాణికుఁడు శీఘ్రగమనమున)

అబ్బా! ఏమివీనిసాహసము. ( నిలిచి వెనుకకు తిరిగి దృష్టిసారించి ) ఏమివింత! ఆచిన్నవాఁడింకను నాయంగవస్త్రమును విడువనేలేదు. ఔరా! ఎన్నిత్రిప్పులు బెట్టుచున్నను వానికిట్లాశ్రయించుట ఎందులకో! రామ! రామ! ఎంత నిర్దయుఁ

డవురా! అయ్యో! ఆదెబ్బకు ముక్కు పగిలి నెత్తురుకాలువలై పారుచున్నది. ఇస్సీ! ముండ్లలోనికేనా యీడ్చుకొనిపోవుట! హరిహరీ! దేహమంతయు రక్తమే! ఇంకను జాలిలేదే! అయ్యో! రాళ్ళమీదనే యీడ్చుచున్నాఁడు. ఇంకను ఆబాలుని చేతిపట్టువీడలేదే? ఔర! ఏమిభయంకరముగానున్నది. హరిహరీ! ఇఁక ప్రాణములేనట్టులేయున్నది. ఇంకొక్కడి ప్రాణము నిర్హేతుకముగ వాఁడిని వీని పొట్టబెట్టుకొన్నాఁడు. నేటియుదయమున నే నెవ్వరి మొగము చూచితినోగాని యీ బ్రాహ్మణునిహత్య చూడవలసి వచ్చినది. ఇఁక నీదృశ్యమును నేఁజూడజాల. హరిహరీ!

(అనిపోవును.)

(దభాలునపడిన శబ్దము వినబడును హనుమంతుఁడు నిజస్వరూపమున ప్రవేశించును.)

హను:-- ఆహాహా! ఈ తులసీదాసువంటి వైరాగ్యచింతామణిని నేనెన్నఁడును గాంచియెఱుఁగ. దేహభ్రాంతి యిసుమంతయు లేక చిత్తంబు మదాయత్తంబు జేసి శరీరంబును నేనెంత బాధించినను ఇంచుకంతయు చలింపడయ్యె. శల్యావశిష్టంబైన దేహంబు చట బడియున్నది. నేఁబోయి యెప్పటివలె జేసి దరిఁజేర్చుకొని యీప్సితంబు సమకూర్చెదఁగాక

(నిష్క్రమించును.)



గోస్వామి తులసీదాసునకు శ్రీఆంజనేయస్వామి
ప్రత్యక్షమై వరం బొసంగుట.

(తులసీదాసు పూర్వపురూపమున ప్రవేశించును.)

తుల:— స్వామీ! శ్రీఆంజనేయమూర్తీ! నిన్నింకవిడుతు
ననుకొంటివా! నీ యిచ్చవచ్చినట్లు చేయుము.
(తనయెదుటనుయిరుప్రక్కలనుజూచి హనుమంతునిఁగానక)
నేబట్టిన పట్టెట్లువదలినది. నాస్వామి నను వీడి
పోయె. శరీరభ్రాంతిత్యజించి ఆత్మరజ్జులచేబంధించి
యుండ నెట్లుతప్పించుకొనియె. సర్వశక్తి యు
క్తుండగుటం జేసి నాయాత్మరజ్జులనుదప్పించుకొని
పోయెనేమో! అది అసంభవము. కానున్న
నాకేల యీమహాపురుషుండుగన్పింపఁడు. దేహ
మా! నీవునన్నిక విడచిపొమ్ము.

(అని తనదేహమునుజూచుకొని)

ఆహా! యిదియేమి వింత. ఇట్టిదేహము నాకెట్లు
గలిగె? రక్తమాంస చర్మవిసర్జితంబై శల్యావ
శిష్టగనున్న దేహము సుస్వరూపంబుగ మారు
టెట్లు? ఇదియా మహానుభావుని చర్యయేమైయుం
డనోపు. క్రియాశూన్యంబుచేసి యిట్టిసుస్వరూ
పంబునాకిచ్చిన నేదన్నువిడుచువాఁడననియెంచెఁ
గాఁబోలు! ఛీ! ఈతుచ్ఛశరీరము నాకేల! నాము
క్తిప్రదాయకుండగు వైకుంఠవాసుని సేవింపని
యునికియేల? ఇఁకస్వామికి నామీఁద దయలేదు
గాన నేనిదేహప్రాయోపవేశంబుజేసెద.

హను:— ఔనౌను. నీవుచెప్పినది సరియేగాని, యిప్పటి కిరువది యెనిమిది కృతయుగంబుల క్రిందట జరిగిన శ్రీరామావతారంబును సందర్శింప వలె నన్న నెట్లు సాధ్యంబు గాఁగలదు. ఇది దుర్ఘట కార్యమగుటచే నా కసాధ్యము.

తుల:— ఆదిరూపుండై, సర్వశక్తుండై, పరాత్పరుం డగు భక్తవత్సలున కిదియొక గొప్పకార్యమా! దేవతాదులు దుష్టులచే బాధఁజెంది ప్రార్థింప యేకవింశత్యవతారముల నెత్తిన మహానుభావునకు నాయపేక్ష రూపమెత్తుట యొకగొప్ప కార్యమా!

హను:— అన్నా! నీమనశ్శుద్ధి యరయుటకై యిట్లంటిని. రేపకడ మమతా మంటపంబుననే శ్రీరామ సాదర్శన మొందించెద. సంశయ మొందకుము. ఇఁక నీవేగుము.

(తెరవుడు నిష్క్రమింతురు)



## పంచమరంగము.

(మమతాదేవి మంటపంబున, మమతాదేవి విషాదముతో నుండును)

మమ:-- నేటికి మాసమునుండి ఆత్మారామార్య గర్భ రత్నము నాకండ్లకుఁ గన్పించుటలేదు. కారణ మేమైయుండును. వానిమూర్తిమంతము జూచి యైన సంతసించు భాగ్యమున్నదో లేదో? పవిత మైన వానికండ్లారఁ జూడఁగలను.

మ॥ విలసత్పావని పాదపద్మముల నేనేళన్ మనోవీధిలోఁ
తులసీదాసు భజించి భక్తుఁడయి శ్రీతో మోదముల్ జెందెనో।
కలకల్ బారి యవస్థల జొరలెనో కాంతార వాసంబులన్
జలబాముల్ బను చుండెనో, వినిగనో, ప్రాణేశుఁ డెట్లుండెనో॥

-• కీర్తన •-

ఆంజనేయునిబట్టి — ఆత్మనుతించిన। గుంజి కోపించి దాఁ
కూర్మిని చూపును ॥అం॥
పవనునినమ్మిన - పరమాత్మ శ్రీరాము। జవసత్వములు లాగి-
చయ్యాన జూపును ॥౨॥

వాయు నందనా! నావరుండు నీభక్తుండు నిరుపమాన తేజోగుణగణానిధియగు దశరథనందనునిజూచు కోరికతో నిన్నాశ్రయించుచున్నారు. వారికోరిక దీర్చి కృతార్థులఁ జేయుము.

-• కీర్తన •-

అనిలాత్మభవ - బ్రోవుమా - కినుకవహింపక॥
కనికర ముంచుమా - కరుణను బ్రోవుము । అనిలతనూభవ - ఆ
రాముజూపుము ॥అని॥
భక్తులఁబోషింప - భక్తులరక్షింప। భక్తరత్నమనిన శక్తి
వంతుఁడవయ్యా ॥అని॥
నినునమ్మి నాభక్త - నిన్ను వేఁడుచుంటి। మన్ననతో రాముని -
మహినిగాంచుము తండ్రి ॥అని॥

ఉ॥ ఎన్నఁడు వాయునందనుఁడొకించుక మోదముఁజెంది రామునిన్
గ్రన్నన జూపనెంచునొకో! ఘాతమెవర్చునో! నాదుభక్తకున్
విన్నదనంబు బోవగను వేడుక రాముని జూపదెచ్చునో
మన్ననభక్తపాదములు మానక గొల్తునో లేదో రాఘవా॥

సీ॥ సంసారమును బాసి సంపదలను రోసి,
సరసిజాక్షుని జూడ జనినవాఁడు
రామనామ మెలెక్కర హీనొందునొల్లక,
తపసియై మతమున దనరినాఁడు ।
ద్వాదశ వర్షముల్ దపియుంచి జపియుంచి!
పావనిపాదముల్ బట్టినాఁడు।
రాము మాడఁగ దాసురాము దూతనుగొల్చి,
యురుకష్టములఁ జెంద నున్నవాఁడు ।

తే॥ తులసిదాసుఁడు నాభక్త తోయజాక్షుఁ
గాంచి సంతోషమున నున్న కాంతుఁ జూచి।
సంతసంబొందు భాగ్యంబు జగతిఁ గలదె ?

( తెర లో )

కలఁ జెంధకు మదెవచ్చెఁ - దులసిదాసు॥

(తులసీదాసు ప్రవేశించును.)

(మమత సంతోషించును.)

-• కీర్తన •-

తుల: -

ఏరీ! ఏరీ! రాములు - వా - రిచట యిచట — రాములు
సీతా లక్ష్మణ సహితులు - శ్రీ- అంజనేయుని విహితులు॥
తడవదియేలనో కేసరి— దడయక నామదిఁ జొచ్చిరి ।
యెఱుఁగరె యెఱుఁగరె యెవ్వరు-యింగిత వేత్తలుపల్వురు॥

(మమతాదేవి పరుగుపరుగునవచ్చి భర్తకుసాష్టాంగ ప్రణామంబు లాచరించి)

మమ:— స్వామీ!

తే॥ దాసరత్నమ దయజేయుఁడాసనమున
అంజనేయులు మనలను రంజితముగఁ।
జేయవేం చేయు చున్నారు శీఘ్రముగను।
జానకీ రామ లక్ష్మణుల్ చాల దయను।

స్వామీ! శ్రీరామచంద్రుల రాకకై మేమెల్లరము వేచికాచి యున్నారము. వారెపుడు వేంచేయుదురు.

తుల:-- ఈమంటపంబు పేరెయ్యది?

మమ:-- మమతా మంటపము.

తుల:— సరి. ఇచటికే వారు వత్తురు.

మమ:-- ఎప్పుడు ?

తుల:-- ఇప్పుడే.

మమ:-- అదెట్లు తెలియును ?

తుల:-- శ్రీఆంజనేయవర ప్రసాదముచే.

మమ:-- ఆతరుణుండదె దల్లిగర్భంబునుండి బయలువెడలి తనవంశజుని రాకఁ దెలియఁజేయు చున్నాఁడు. ఆభానుని మ్రింగఁబోవ రివ్వున వచ్చు చున్న యీమహానుభావు లెవ్వరుస్వామీ!

తుల:-(పైవంక చూచి దిగ్గునలేచి) వారా! నాపాలిటిపాలన కర్తలు పరమ పావనులు. పవనాత్మజులు. పవిత్రులు. పరుగుబరుగున వేంచేయు చున్నారు. వారేకదా నామోక్ష సిద్ధికి కారణము. జే! హనుమంతా! కీర్తివంతా! బలవంతా! జే!

కీర్తన.

వచ్చుచున్నాఁడే-నా-బ-యుతనూజుఁడు-వరప్రసాదిటు ॥వ॥
రామనామమును—ధీమహిమంబును। నామముగల్గిన। నేర్పరి యల్లదో ॥వ॥
వేడెదగోర్కెను-వేగఁదీర్పఁగను । పాడెదనామము- పాదము బట్టియు ॥వచ్చు॥
రామదర్శనము-రయమున జేయఁగ నీమము వేడెద నెనరు— జూపఁగను ॥వచ్చు॥
కొట్టినఁదిట్టినఁ గోపగించినను। దిట్టతనంబున దీనతఁగొలిచితి ॥వచ్చు॥
వెంటఁబో రొదను-జంటనిల చెదను । వింటకింపుగా వేడెదఁ బాడెద ॥వచ్చు॥

(మమతాదేవి వచ్చుచున్న హనుమంతునకు నమస్కరించును)

మమ:-

శా॥ వాతాధ్వంబున నబ్ధిదాటిపడినవైదేహి వీక్షించిత ।
శ్రీసీతాక్షేమము నెల్ల రామునకు భక్తిం జెప్ప యుద్ధంబులో

ఘాతం బొందఁగఁజేసె రావణుని ఓంకారాది శబ్దంబులన్
జేతో మోదముతో జపించువారి జేజేరామ భక్తాగ్రణీ ॥

దండకము.

శ్రీమన్ మహాకార్యధుర్యా! ధురీణప్రభా! దివ్యతేజా! సమీ
రాత్మజా! శ్రీమరుత్పుత్ర! సుగ్రీవ నిత్యాప్త! సత్కృత్పవిత్రా !
భవద్రూపసంధాన మందాత్మఁ జొన్పన్ గసంతోష మింతింత
నంరానిదాగాదె! నాభర్త శ్రీరామసుందర్య నాసక్తతన్
గోరఁ గోపించి శ్రీరామ జూపన్ వరంబిచ్చి తెంచేసి
మాకిల్ల మీదివ్యరూపంబు జూపన్ గటాక్షింప రావే!
భజే వాయుపుత్రం! భజేబ్రహ్మకాయం! భజే ఆంజనేయం।
నమస్తే నమస్తే నమస్తే నమామి।

(హనుమంతుఁడు ప్రవేశింప)

తుల:— దండకము.

నమస్తే పరాభూత సూర్యా! నమస్తే కృతామర్త్యకార్యా!
నమస్తే! సదాబ్రహ్మచర్యా! నమస్తేసదా వాయుపుత్రా!
నమస్తే సదాపింగళాక్షా! నమస్తేసదారామభక్తా ! నమస్తే
నమస్తే నమామి (సాష్టాంగపడును.)

మమ:— కారుణ్య రత్నాకర మూర్తికిదే ప్రణ
మిల్లుదాన.

(సాష్టాంగపడును)

హను:— (ఇరువురను లేవదీసి) శ్రీరామ హృదయవాసిని
తులసీదాసదాస్య వికాసినీ మమతా! మాయమ్మ

సీతమ్మ మున్ముందు నిన్ను వీక్షింప నతికుతూ
హలమున వేంచేయుచున్నది. ఏలయన శ్రీరామ
మూర్తి యామెజంటనుంటకంటె నీహృదినుంట
యెక్కువాయెనఁట. అన్నుమిన్నా! చెన్ను
మీరు నీచిత్తశుద్ధికి భగవంతుండు మెచ్చి నీకార
ణంబున నీపతికిదర్శనంబీయ నేతెంచుచున్నాఁడు.

**తుల:**— గురూత్తమా! అట్లనెదరేల! ఈపెయెవరు? నా
మాతయగు మమతాదేవిగదా! ఆమెకరుణాతిశ
యమే నాకామాంధకారమును బారఁద్రోలిన
జ్యోతి. తుదకామె కతంబుననే నాకు శ్రీరామ
సందర్శనంబుగూడఁగల్గుచున్నది. ఆహా! తల్లీ! నీవు
నాకుపాప సంద్రంబు నెట్టిన నావవే సుమా
(అంజనేయుని వైపుతిరిగి) మహానుభావా! మీయ
నుగ్రహంబునగదా! భవాంభోధి దాటఁగంటి.
సత్సాంగత్యము సర్వశ్రేయము. స్వామీ!
శ్రీరామచంద్రులు దర్శనమీయనిటకు రా
మరువరుగదా?

కీర్తన.

**హను:**— ఇదుగో రామమూర్తి—అల్లదుగో రామమూర్తి
తులసిదాసు నేలు— రఘు— కులతిలకు లెజాలు॥
ఫలమునదర్శములు—గని— బలువితములఁగ్రోలు
మమత మమతదీర్చ— జని—మమత మొదటదీర్చ॥



శ్రీరామసందర్శనము.

భక్తవరుల బ్రాపు- భవ-బంధములను బాపు
ముక్తినియఁ జూఁపు- గడు-మోక్షమునకు దాపు॥

(హనుమంతుని కిరుప్రక్కలఁ దులసిదాసు మహతియునిలువ శ్రీరామచంద్ర సీతాలక్ష్మణులు విచ్చేయ ముగ్గురు నమస్కరింతురు.)

శ్రీరాము:- భక్తరత్నమా! తులసీదాసా!

మ॥ తులసీదాసవరేణ్య కష్టపడితో దూగాడితో యెంతయున్
వలవన్ రాని విరక్తిమార్గమున నే వైరాగ్యమున్ బూనితే
గెలువఁ రానివియీషణత్రియములఁ గెల్పొందితే కోసితే
వెలయఁ ఖూస్థిర చిత్తుభక్తుఁడవుగా వేల్పుల్ నరుల్ మెచ్చరే॥

వత్సా! తులసీదాసా! నీభక్తిశ్రద్ధలమోఘములు నీచరిత్ర మతిపవిత్రము! నీ సుగుణము లగణ్యములు. నీచిత్తమునుదాయత్తంబుజేసి పడరాని పాట్లుపడి తదేకేకాగ్రచిత్తత నుండు నీ దృఢచిత్తంబునకు మెచ్చితి. నీకు గావలయు వరంబులఁ గోరుము నేనొసంగెద.

తుల:— దేవాదదేవా! స్వప్రభావా! తమదర్శనప్రభావంబున నాయభీష్టంబు నెరవేరినది. ఇఁక నేగోరునది లేదు. మీరుకోరుమంటిరిగానఁ గోరెద.

మ॥ పరమీశుంగదె నేనుగోరినపుడే వాత్సల్యతఁ మాతతో,
సరసఁ జేరుకదర్శనంబు నిడఁగా సాయుజ్య, సారూప్యమున్
పరమానందము మాని విద్యల కిలన్ ప్రాపేదియో నిన్ గనన్।
పరమానందముతోడ దానినిడుమా ప్రజ్ఞానిధీ ధీమణీ॥

శ్రీరా:— పుత్రకా! నీవాత్సల్యత లీడేరును. నీరెండవ కోరిక ఆంజనేయునిచే నీవు బ్రహ్మోపదేశమును బొందుము. నీకు కావలసినదేదియు లేదు. ఏలయన నీవు పూర్వజన్మంబున వాల్మీకి మునిపుంగవుండవై లోకోపకారంబు జేయ నవతరించిన పరమభాగవత శిఖామణివి. భారద్వాజునకు బరతత్వము కరతలామలకము జేసిన మహానుభావుండవు. నీవు నీపూర్వజన్మ నొక్కసారి జూచుకొమ్ము. (కండ్లుతుడుచును) (తులసీదాసు పోయి, వాల్మీకియే వచ్చును)

తుల:— ఆహాహా! మహానుభావా! దీనరక్షకా! రామచంద్రమూర్తి! తమకృపాకటాక్షముచే నాపూర్వజన్మఁ గాంచితి. ఇఁక నాకేల యీజన్మ.

శ్రీరా:— ఆగుఁమాగుఁము. నీవు నీపూర్వజన్మంబున నీభార్యకు కామాశనుగొల్పి భిన్నముజేయుటచే నామహాపతివ్రత యిప్పుడు మమతాదేవియై జన్మించె. కాన మీయిరువురు యేకముగ యీమందిరంబున దిరుగ గృహస్థాశ్రమమున నుండి యీశ్వరేచ్ఛం బ్రవర్తిల్లి రామాయణమును జేయుము. మీయిరువురను నేగాపాడుచుండును. ఆమెకు సంసారాపేక్ష యడఁగిన తఱి సీతానుమతిని బొందితో కైలాసంబునకుతీసికొని పోయెద.

సీత:-- మమతా దేవీ! స్వామి దయచేసిన వరంబులు జాలునా! మరేమైన గావలయునా! వలయునేని గోరుము నే నొసంగెద.

మమ:— మహాను భావులు భూత భవిష్యద్వర్తమానంబులఁ దెలసిన ప్రాజ్ఞులొసంగిన వరంబులు జాలును. తల్లీ! మఱొందు గోరిన గొలంది గోరిక లధికమై జన్మలినుమడించును గదమ్మా. మీకటాక్షము మామీదఁ నెరపిన జాలును.

సీతారామ లక్ష్మణులు:— తథాస్తు: —మంగళమహా శ్రీ శ్రీ శ్రీ.

### భరతవాక్యము.

చం॥ ధరగల వస్తుజాలములు దండిగ వృద్ధిని జెందుగావుతన్।
పరమతబోధనుల్ మునులు భక్తుల నెప్పుడు బ్రోచుగావుతన్
పరసుగుణాఢ్యులై సతులు భర్తలగొల్చుత నెల్లకాలమున్।
ధరవరు లెల్ల శ్రీతులసి దాసుని బోలిచరించు గావుతన్।



# శుద్ధపత్రిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| [illegible] | 4 | వాగుర తితులలోను | వాగురాలతులలోను" |
| ,, | 7 | మోహామంతియును | మోహామింతయును |
| 20 | 8 | రూపిజిత | రూపజిత |
| 28 | 11 | వేవారునాలంబుకై | వేమారు నాలంబుకై |
| 45 | 1 | తులశీదాసనాటకము | తులసీదాసనాటకము |
| 51 | 10 | విరివిన్ డెందపు వేడి యూస | విరివిన్ డెందపు లేడియూస |
| 60 | 5. | ఇందులనాసతి . | ఇందులకే నాసతి |
| 63 | 15 | కుండెను | కుంచెను |
| 66 | 5 | ధనసంపదల గూర్చు | ధనసంపదల గూల్చు |
| 84 | 5 | గోప్యమటంటెని ! | గోప్యమట. టెన ! |
| 93 | 6 | దలఁవుము | దలపుము |
| 94 | 23 | నాచింత | నాముచింత |
| 02 | 4 | ధీరజారిణినై | ధీరతజారిణినై |
| 07 | 13 | వరుఁడనా | వరుఁడపునా |
| 13 | 15 | శక్తిమించివను | శక్తిమించనిను |
| 14 | 2 | బాలకా–బాలకా– | బాలకా– చాలకా– |
| ,, | ,, | ప్రలాకించెవవు | ప్రిలాపించెశవు |
| ,, | 16 | నా–శక్తి | నా–సక్తి |
| 15 | 7 | న్నవి. | న్నది |
| 9 | 4 | సంశయం | సంశయ |
| 20 | 19 | వీవనుచెల్పకో॥ | వీవనుచుచెల్పకో॥ |
| 22 | 23 | క్షంచిశ్రీరాము | క్షంచ్రిశీరాము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 146 | 21 | ఫలమునదర్శనములు | ఫలముదర్శనములు- |
| 147 | 9 | కోసిలే | కోసితే |
| 147 | 10 | వెలయున్ భూస్థిర చిస్ఫూర్తి | వెలయున్ భూస్థిర చిత్స్ఫూర్తి |
| 148 | 10 | (పోయి, వాల్మీకియే వచ్చును.) | (ధ్యానమును చేయును ) |

నాకుండు తొందరపనులలో నాకు గాంచగలిగిన తప్పులను ఒప్పులుగ దిద్ది వ్రాసితిని. తక్కుంగలవాటిని దిద్ద చదువరులు ప్రార్థితులు.

ఉప్పలూరు,
21-12-24.

ఇట్లు,
గ్రంథకర్త.

